# సప్తపది

రచన :
ప్రొఫెసర్ ఎస్. బి. రఘునాథాచార్య
డైరక్టర్ జనరల్
శ్రీ వేంకటేశ్వరోన్నత వేదవిద్యాధ్యయన పరిషత్
తిరుపతి



ప్రచురణ
డాక్టర్ ఐ. వి. సుబ్బారావు, ఐ.ఏ.ఎస్., పిహెచ్. డి.,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి
2000

# SAPTAPADI

A Monograph on Hindu Marriage System

by

Professor S.B. Raghunathacharya,

Director General

S.V. Institute of Higher Vedic Studies

T.T. Devasthanams, Tirupati.



T.T.D. Religious Publications Series No.

First Edition : 1985

Second Edition : 2000

Copies : 3,000

Published by :

**Dr. I.V. Subba Rao,** I.A.S , Ph.D.,

Executive Officer

Tirumala Tirupathi Devasthanams

Tirupathi.

Printed at :

Gayathri Art Printers

5-9-33, Basheerbagh,

Hyderabad - 500063.

Phone : 3230210

# ఒక్కమాట

భారతీయుల కింతటి మహనీయసంస్కృతి ఏర్పడటానికి సాక్షాత్తుగాను, పరంపరగాను ఎన్నో కారణాలున్నాయి. ఏనాడో మన పెద్దలేర్పాటు చేసిన వివాహవ్యవస్థ ఈనాటికీ ఫలప్రదంగా ఉండి భారతీయసంస్కృతికి పెట్టని అలంకారం కావడం ఎంతో సంతోషించదగిన విషయం. కానీ మన తాతముత్తాతలనుండి మనకు సంక్రమించిన ఈ వ్యవస్థను సమాజం నవనాగరికత ముసుగులో చిన్నచూపు చూస్తున్నది. సుముహూర్తంలో మహనీయుల సమక్షంలో ఏర్పడుతున్న మాంగల్యబంధాన్ని ఎగతాళి చేస్తున్నది. అందువల్లనే విచ్ఛిన్నమైన అనుబంధాలు, అతికృత్రిమమైన సంబంధాలు యువతీయువకుల్లో దర్శనమిస్తున్నాయి. ఫలితంగా మానవుడు మనశ్శాంతిని కోల్పోతున్నాడు.

వివాహసమయంలో వధూవరులు చేసుకొనే బాసల అర్థాలు తెలిస్తే అప్పుడు జరిగే క్రియల విలువలను వారు గ్రహిస్తే, భార్యాభర్తల అనుబంధం ఎంత పవిత్రమైందో వారు గమనించగలుగుతారు. అప్పుడు సమాజం పతనోన్ముఖం కాకుండా కట్టుదిట్టంగా ఉంటుంది. అందుకే ఈ చిన్ని ప్రయత్నం. ప్రొఫెసర్ ఎస్.బి. రఘునాథాచార్యగారు ఎంతో చక్కగా రచించిన ఈ సప్తపదిని దేవస్థానం మొదట **1985** లో ప్రచురించింది. మూడు నెలల్లోనే ముద్రించిన ప్రతులన్నీ అయిపోయినాయి. చాలాకాలంనుంచి మళ్లీ ప్రచురించమని ఎంతమందో కోరుతున్నారు. ఇప్పటికి దీన్నిలా ప్రచురించగలుగుతున్నందుకు ఎంతో సంతోషం. సప్తపదిని క్యాసెట్ రూపంలో కూడ తయారుచేస్తే బాగుంటుందని కొందఱు సూచిస్తున్నారు. త్వరలో ఆ ప్రయత్నం.

ఈ పుస్తకాన్ని బాగా చదివి నూతనవధూవరులు తమ దాంపత్యజీవితాన్ని పరస్పరావగాహనతో పండించుకుంటారని భావిస్తున్నాను. రచయిత ప్రొఫెసర్ ఎస్.బి. రఘునాథాచార్యగారిని మనసారా అభినందిస్తున్నాను.

**డాక్టర్ ఐ.వి. సుబ్బారావు** ఐ.ఏ.ఎస్.

తిరుపతి — కార్యనిర్వహణాధికారి

**18-4-2000** — తిరుమల తిరుపతి దేవస్థానములు

# అభిరుచి

బంగారునగలకు మెరుగుపెడితే ఎలా ధగధగా ప్రకాశిస్తాయో, అలాగే పుట్టినప్పటినుంచీ అనేక సంస్కారాల ద్వారా ఆత్మ ప్రకాశిస్తుంది. జాతకర్మ దగ్గఱ నుంచి జీవితాంతం వఱకు మానవుడికి అప్పుడప్పుడు అనేక సంస్కారాలు అవసరమని అనుభవజ్ఞులైన పెద్దలు అష్టాదశ సంస్కారాలను విధించారు. ఈ పద్దెనిమిది సంస్కారాల ద్వారా ఆత్మప్రకాశాన్ని పొందిన మానవుడు భగవాన్‌కు చేరువకావడానికి అవకాశమేర్పడుతున్నది.

సంస్కారాలు అనేకం ఉన్నా అందులో వివాహమనేది చాలా ప్రధానమైన సంస్కారం. ఇది ఎందఱి అదృష్టాలపైనో ఆధారపడి ఉంటుంది. భావి జీవితనౌకకు తెడ్డులాంటిది. వధూవరులు ఆ సంస్కారాన్ని పొందుతూ దాని విలువలను వివరించే మంత్రభాగానికి అర్థం కూడా తెలుసుకోగలిగితే వాళ్ల జీవితం నిజంగా స్వర్గసీమ అవుతుంది.

ఈనాడు సమాజం చిన్న చూపు చూస్తున్న ఈ అంశం పైన చిన్న పుస్తకాన్ని వ్రాయమని కోరినవారు, అప్పటి తి.తి.దే. కార్యనిర్వహణాధికారి, శ్రీ ఎస్. లక్ష్మీనారాయణగారు. ఇప్పుడు ద్వితీయముద్రణ చేస్తున్నవారు ప్రభు-మంత్ర-ఉత్సాహశక్తి సంపన్నులు డాక్టర్ ఐ.వి. సుబ్బారావు ఐ.ఏ.ఎస్. , పిహెచ్.డి. కార్యనిర్వహణాధికారి, తి.తి.దే. గారు. వీరికి హృదయపూర్వకంగా కృతజ్ఞతామందారాల నందిస్తున్నాను.

తెలుగునాట ప్రతి కల్యాణవేదికపైన ఈ 'సప్తపది' సంభావింపబడితే, క్రొత్త దంపతులకు ఈ రచన క్రొత్త క్రొత్త స్ఫూర్తుల నిచ్చి గృహస్థాశ్రమపు విలువలను మనసులో నిలపగలిగితే, పాత దంపతులు తమ దాంపత్యఫలాన్ని ఇందులో సందర్శించగలిగితే, వివాహ విజ్ఞానవాహినిని తరతరాలకు అందించగలిగితే రచయితకు అంతకంటే ఆనందమేముంటుంది? అస్తు.

'సమేధతాం సాప్తపదీన సఖ్యమ్'

తిరుపతి — రఘునాథాచార్య

1.1.2000

# అనుక్రమణిక

## మొదటిభాగం


1. మానవజీవనం
2. మూడు ఋణాలు
2.1 దేవఋణం
2.2 ఋషిఋణం
2.3 పితౄణం
3. నాలుగు ఆశ్రమాలు
3.1 బ్రహ్మచర్యం
3.2 గార్హస్థ్యం
3.3 వానప్రస్థం
3.4 సన్న్యాసం
4. గృహస్థాశ్రమం గొప్పదనం
5. వివాహమంటే ఏమిటి ?
6. పర్యాయపదాలు
7. వివాహమెన్ని రకాలు ?
7.1 బ్రాహ్మం
7.2 దైవం
7.3 ఆర్షం
7.4 ప్రాజాపత్యం
7.5 ఆసురం
7.6 గాంధర్వం
7.7 రాక్షసం
7.8 పైశాచం
8. వివాహ ప్రశంస
9. కన్యా లక్షణాలు
10. వర లక్షణాలు
11. నాతిచరామి
12. భర్త ప్రేమను పొందాలంటే.....
13. త్వరగా పెళ్లి కావాలంటే....
14. ఏడు జన్మల బంధం
15. సమాజసేవ
16. పరిణయంతోనే పరిపూర్ణత
17. అర్ధాంగి
18. స్త్రీ గౌరవం

19. మకుటంలేని మహారాణి
20. గృహపత్ని
21. మగపిల్లవాడే పుట్టాలి
22. సమభావన
23. వంశవృద్ధి

## రెండవ భాగం

1. వివాహవిజ్ఞానం
2. గోదానవ్రతం
3. స్నాతకం
4. సమావర్తనం
5. కాశీయాత్ర
6. యజ్ఞోపవీతం
7. కన్యావరణం
8. వరాగమనం
9. వరపూజ
10. గోత్రప్రవరలు
11. మహాసంకల్పం
12. మంగళాష్టకాలు
13. కాళ్లు కడగడం
14. కన్యాదానం
15. మధుపర్కం
16. సమీక్షణం
17. యోక్త్రధారణం
18. మంగళసూత్రం
19. తలంబ్రాలు
20. కంకణాలు
21. బ్రహ్మముడి
22. ప్రధానహోమం
22.1 మంచిసంతతి కలగాలి
23. పాణిగ్రహణం
24. సప్తపది
25. లాజహోమం
25.1 మా దాంపత్యం చల్లగా వర్ధిల్లాలి
26. అరుంధతీ దర్శనం
27. వధూవరుల బాసలు
28. పెద్దల ఆశీస్సులు

# సప్తపది

మహర్షిభి ర్మంగళశీలవద్భిః
అభ్యాహితోఽ నుష్ఠిత ఆదరేణ।
చిరాదయం విశ్వజనీన ఆర్యాః
వివాహపన్థా నితరాం సమిన్ధామ్॥

లోకమంగళస్వభావులు, మహనీయులైన మహర్షులు విశ్వకల్యాణ హేతువైన ఈ వివాహపద్ధతిని కనిపెట్టారు. అంతేకాదు, ఎంతో ఆదరంతో వాళ్లు చాలాకాలం గృహస్థధర్మాన్ని ఆచరించారు కూడా. మానవ జాతికి మంచిని పంచే ఈ వివాహవ్యవస్థ ఇంకా ఇంకా ప్రకాశించుగాక!

## 1. మానవజీవనం:

సృష్టిలోని ఎనభైనాలుగు లక్షల జీవరాసులలో అన్నివిధాలా శ్రేష్ఠమైన జన్మ మానవజన్మ. ఎన్నో జన్మలలో పశువుగా పక్షిగా చీమగా దోమగా ఎంతో పరితాపాన్ని అనుభవించి, దుర్లభమైన నరజన్మను పొందుతున్నాడు జీవుడు. అందుకనే అంటారు పెద్దలు —`జంతూనాం నరజన్మ దుర్లభం'అని. నిజమే, ఈ సృష్టిని జాగ్రత్తగా పరికిస్తే, మన చుట్టూ ఉన్న ప్రకృతిని నిశితంగా పరిశీలిస్తే మానవుడెంత అదృష్టవంతుడో అర్థమవుతుంది. మంచి చెడులను ఆలోచించి, వివేకంతో సంస్కారంతో జీవితాన్ని చక్కదిద్దుకొనే శక్తి ఇతరజీవులకంటే మానవునిలో అధికంగా ఉన్నది. ఇదే మానవునికి అసాధారణ లక్షణం.

మానవుడు ఒంటరిగా జీవించలేడు. తన భావాలను అనుభవాలను అనుభూతులను ఇతరులతో కలసి పంచుకున్నప్పుడే అతని జీవనం తృప్తిగా ఆనందంగా గడుస్తుంది. అలా ఎవరితోను కలవక, అంటకుండా ముట్టకుండా జీవితం గడపటం చాలా దుర్భరం. తాను సంతోషంగా జీవిస్తూ, శాంతిని అనుభవిస్తూ, ఆ సంతోషాన్ని శాంతిని తన చుట్టూ ఉన్నవాళ్లకు కూడా పంచిపెడుతూ జీవించినప్పుడే మానవజీవితానికి అర్థం పరమార్థం ఏర్పడుతుంది.

బాల్యంలో సహచరులతో సహజీవనం సంభవిస్తుంది యౌవనంలో జీవితభాగస్వామినియైన సహధర్మచారిణితో ప్రారంభమౌతుంది. వార్ధక్యంలో భార్య, పిల్లలు, మిత్రులు, తోటి సాధకులతో గడుస్తుంది. మొత్తం మీద విరక్తుడై విపినవాసంచేసేవాడు తప్ప మిగతావాళ్లందఱు కొందఱితోనైనా ప్రేమతో సేవాభావంతో కలసి మెలసి బ్రతకవలసినవాళ్లే. అలా బ్రతకడంలోనే మానవుడు మాధవునికి దగ్గఱౌతాడు.

**2. మూడు ఋణాలు:**

ఎవరైనా ఏ కొంచమైనా మనకు సహాయంచేస్తే మనం వాళ్లకెంతగానో ఋణపడినట్లు కృతజ్ఞతలందిస్తాం. ఎంతో వినయాన్ని ప్రదర్శిస్తాం. ఎందుకలా చేయాలి? వాళ్ల కృషిని, వాళ్లుపడ్డ శ్రమను మనం ఉపయోగించుకున్నాం కాబట్టి. అలాంటప్పుడు దేవతల దయవల్ల ఈ భూమిపైన చక్కని వర్షాలుపడి, పంటలుపండి దేశం సుభిక్షంగా ఉంటున్నది కదా! మఱి మనం వాళ్లకు ఋణపడటం లేదా? వారి విషయంలో వినయంతో కృతజ్ఞతతో ఉండాలా? 'లేదా? అలాగే చరిత్రకందని కాలంనుంచి ఎంతో జ్ఞానాన్ని సంపాదించి మనదాకా ప్రచారంలో ఉండేటట్లుచేసి, ఈ మానవజాతిని తీర్చిదిద్దిన మహర్షులెందఱో ఉన్నారు.

వారికి మనం కృతజ్ఞులుగా ఉండవద్దా? ప్రతివాడు 'నేను' అనుకోవడానికి ఆశ్రయమైన ఈ శరీరాన్నిచ్చి, పెంచిపెద్దచేసి, విద్యాబుద్ధులను చెప్పించి, మంచి సంస్కారాలను, విలువలను నేర్పి ఉత్తమపౌరుడుగా తీర్చిదిద్దిన తల్లిదండ్రులు, వారి తాతముత్తాతలు, తరతరాలుగా ఎందఱో పితృదేవతలున్నారు. వారికి నిజంగా మనం ఋణపడలేదా? తప్పక ఋణపడ్డాం. చూడండి—వసిష్ఠస్మృతి (11.52,11.43) ఏమి చెబుతున్నదో...

> **విజ్ఞాయతే హి త్రిభిః ఋణైః ఋణవాన్ బ్రాహ్మణో జాయతఇతి.**
> **యజ్ఞేన దేవేభ్యః, ప్రజయా పితృభ్యః, బ్రహ్మచర్యేణ ఋషిభ్య.**
> **ఇత్యేష వా అనృణో యజ్వా, పుత్రీ, బ్రహ్మచర్యవానితి.**

## 2.1 దేవఋణం:

పంచమహాభూతాలు మనకు మంచిజీవితాన్ని ప్రసాదిస్తున్నాయి. ఇంద్రాది దేవతలు మనకు చక్కని వాతావరణాన్నిచ్చి, వర్షాలను కురిపించి పంటలు పండటానికి దోహదంచేస్తున్నారు. సూర్యచంద్రులు ప్రాణికోటి బ్రతకడానికి కావలసిన ఆరోగ్యాన్ని, వెలుగును, ఓషధులను అందిస్తున్నారు. వారందఱికి మనమెంతో ఋణపడి ఉన్నాం.

కనుక వారికోసం మనం కొంత త్యాగం చేయాలి. యజ్ఞమంటే త్యాగమే. మన కృతజ్ఞతను వారికి తెలియజేసే పద్ధతులే ఈ యజ్ఞ యాగాలు. వాళ్లను మనం చిన్నచూపు చూస్తున్నాం. అందుకే ఈ దుర్భిక్షాలు, కరువుకాటకాలు, ఆకలిచావులు, అతివృష్టులు, అనావృష్టులు. మానవుడు కృతఘ్నుడు కాకూడదు. దేవఋణాన్ని తీర్చాలి. ఈ దేవ యజ్ఞం ఏనాటికి ఆగకుండా సాగుతూ ఉండాలి.

## 2.2 ఋషి ఋణం:

అంధకారబంధురమైన ఈ విశ్వంలో ఎందఱో త్యాగధనులు, మహనీయులు ఉద్భవించి, ఎంతోకాలం తపస్సుచేసి దివ్యజ్ఞానాన్ని సంపాదించి మనదాకా అందించారు. మహర్షుల తపఃఫలం మహోజ్జ్వలమైన మన ధర్మం. వారు జ్ఞానవిజ్ఞానాలను మన కివ్వకపోతే మనమీనాడు ఇంత సభ్యతతో సంస్కారంతో జీవించగలిగేవాళ్లం కాదు. వాళ్ల అనుభవాలను, అనుభూతులను గ్రంథస్థం చేసి శాశ్వతం చేయకపోయినట్లైతే మనమెంత వెనకబడిపోయి ఉండేవాళ్లమో! మన అజాగ్రత్తవల్ల ఇప్పటికి నశించిపోయిన వాఙ్మయం పోగా, ఇంకా ఎంతో విజ్ఞానానికి మనం వారసులం. అందుకే వారికి మనం ఋణపడిఉన్నాం. బ్రహ్మచర్యంతో, శ్రద్ధతో ఆ వాఙ్మయాన్ని అధ్యయనంచేసి ఈ జ్ఞానపరంపరను మనతో నశించకుండా రానున్నతరాల్లో ఇంకొంతమందికి అందించి ఆ ఋణం మనం తీర్చుకోవాలి. ఈ జ్ఞానయజ్ఞం ఇలా కొనసాగుతూ పోవాలి.

## 2.3 పితౄణం:

మానవజాతి ఏర్పడినప్పటినుంచి ఎన్నో అసౌకర్యాలను అనుభవించి, బాధలను భరించి, మన తాతముత్తాతలు, వారి తాతముత్తాతలు అవిచ్ఛిన్నంగా మనదాకా ఈ మానవసంతతిని కనిపెంచి తీర్చిదిద్దారు. ఈనాడు ఇంత ఆరోగ్యంతో మన శరీరాలున్నాయంటే దానికి ఎవరు కారణం? మన తల్లిదండ్రులు. వారికి వారి తల్లిదండ్రులు. అలా ఎన్నో తరాల పూర్వంవారు కారణం. కనుకనే తల్లిదండ్రులు ప్రతివాళ్లకు ప్రత్యక్ష దైవాలు. అలాంటి పితృదేవతల ఋణాన్ని తీర్చడం ప్రతివాడి ముఖ్య కర్తవ్యం. ఎలా ఆ ఋణం తీరుతుంది? గృహస్థాశ్రమంలో ఉండి మంచి సంతానాన్ని కని వంశాన్ని అవిచ్ఛిన్నంగా పెరగనీయడం ద్వారా మన పితృదేవతలకు తర్పణాది క్రియలను నిర్వహించే యోగ్యులైన పుత్రులను కనడంద్వారా. ఈ పితృయజ్ఞం పితాపుత్రపరంపరగా నిరంతరం నిరంతరాయంగా జరుగుతూండాలి.

## 3. నాలుగు ఆశ్రమాలు:

సభ్యత, సంస్కృతిగల సమాజంలో ఉన్నత సంస్కారంగల మానవుడు తన జీవితంలో బాల్యం నుంచి పొందే నాల్గుదశలే నాలుగు ఆశ్రమాలు. ఆ దశలు బ్రహ్మచర్యం, గృహస్థం, వానప్రస్థం, సన్న్యాసం. భారతీయులొక్కరే మానవజీవితాన్ని చక్కగా మలచుకొని మహనీయమైన ఆశ్రమభావన చేయగలిగారు. ఈ లోకంలో సముచిత భోగాలను అనుభవించడానికి మన తత్త్వశాస్త్రం, మన ధర్మం ఎన్నడూ అడ్డురావు. అయితే అందులో ధార్మికత్వం లోపించగూడదు. అందువల్ల ఈ జీవితంలో ధర్మబద్ధంగా సుఖాన్ని అనుభవించి, తాత్త్వికదృష్టితో ఇంతకంటే శాశ్వతమైన సుఖాన్ని సంపాదించుకోవడానికి ఈ ఆశ్రమాలు నాలుగు చక్కగా రూపొందించబడ్డాయి.

## 3.1 బ్రహ్మచర్యం:

ప్రతివ్యక్తి కొన్ని నియమ నిబంధనలకు కట్టుబడి, భావిజీవితాన్ని భవ్యంగా రూపొందించుకోవడానికి కావలసిన విజ్ఞానాన్ని సంపాదించుకొనే

దశనే బ్రహ్మచర్యం అన్నారు సుఖాలకు దూరంగా గురుకులంలో ఉండి, వినయంతో విధేయతతో, అహంకారం లేకుండా గురువు ఆదేశాలను ఆచరణలో పెట్టి ఆయన ఉపదేశించిన విద్యను గ్రహించే ఆశ్రమం ఇది. బ్రహ్మచర్యాశ్రమంలో సంపాదించిన విద్య విజ్ఞానం వివేకం తరువాత రాబోయే జీవితానికి చక్కని లక్ష్యశుద్ధిని కలిగిస్తాయి. అలాగే అహంకారరాహిత్యంతో తోటి సమాజానికి తానెలా సేవచేయాలో తెలియజేస్తాయి.

ఒకరకంగా ఇది గురుతరమైన గృహస్థాశ్రమాన్ని స్వీకరించడానికి మొదటి మెట్టని కూడా చెప్పవచ్చు. గురుకులంలో ఉండి అధ్యయనం చేస్తూ జీవితసర్వస్వాన్ని చదువుకుంటాడు బ్రహ్మచారి.

## 3.2 గార్హస్థ్యం:

బ్రహ్మచర్యాశ్రమంలో చక్కని విద్యావివేకాలను సంపాదించిన బ్రహ్మచారి గురుదక్షిణ సమర్పించి స్నాతకుడౌతాడు. "అవిచ్ఛిన్నంగా నీవఱకు వచ్చిన ఈ మానవసంతతిని విచ్ఛేదంచెయ్యవ"ద్దనే గురువు ఆదేశాన్ని పురస్కరించుకొని గృహస్థాశ్రమంలో ప్రవేశిస్తాడు. గృహస్థాశ్రమం చాలా బాధ్యతలతో నిండినది. ఈ సమాజంలోని సాధువులకు, సన్న్యాసులకు, దీనులకు ఆర్తులకు ఆశ్రయమందించి ఆదరించాల్సింది గృహస్థులు మాత్రమే. అతిథులను, అభ్యాగతులను అసహ్యించుకోకుండా ఆదరంతో తనశక్తికి తగినట్లు గృహస్థు సత్కరించాలి. తనదాకా వచ్చిన వంశప్రతిష్ట చెడకుండా వంశాన్ని నిలబెట్టి, తన కుటుంబాన్ని పోషించడానికి ధార్మికంగా సంపాదించి, తన సంపాదనలో కొంతభాగం అనాథలను ఆదుకోవడానికి ఖర్చుచేస్తూ, ఈ సమాజగమనానికి ఉపకరించాలి.

వివాహం చేసుకొని గృహస్థాశ్రమ ధర్మాలను నిర్వహించే యజమానికి గృహిణి అర్ధాంగిగా అన్ని పనులలోను చేదోడు వాదోడుగా ఉండాలి. ఇద్దరు కలసి గృహస్థాశ్రమాన్ని చరితార్థం చేయాలి. మంచి సంతానాన్ని కని ఈ సమాజానికి బాధ్యతగల పౌరుల్ని అందించాలి.

వాళ్లు సమాజసేవ చేస్తూ తమ సంతానంగూడా సమాజసేవ కంకితమయ్యేటట్లు ఆదర్శకుటుంబాన్ని తీర్చిదిద్దాలి.

**3.3 వానప్రస్థం:**

పిల్లలు పెద్దవాళ్ళైన తరువాత కుటుంబానికి సంబంధించిన బరువు బాధ్యతలన్నీ వాళ్లకు వదిలిపెట్టి వైరాగ్యాన్ని పెంచుకుంటూ త్యాగభావనతో ఆధ్యాత్మికజీవనాన్ని గడపడానికి దంపతులు సిద్ధపడాలి. నగరాలలో పట్టణాలలో సాధనకు అంతరాయాలు హెచ్చు కాబట్టి అరణ్యాలకు బయలుదేరి వెళ్లడం ఈ ఆశ్రమంలో పరిపాటి. అరణ్యాలకు బయలుదేరి వెడుతున్నారు కాబట్టి వీళ్లు వనప్రస్థులవుతారు. వీరి ఆశ్రమం వానప్రస్థాశ్రమం. వానప్రస్థులు వనాలలో, నదీసంగమప్రాంతాలలో పర్వతాలపైన ధ్యానం, ఆధ్యాత్మికచింతనలు చేస్తూ జీవితాన్ని గడిపేవాళ్లు.

భార్య ప్రక్కనే ఉండి యజమాని ధ్యానానికి, తపస్సుకు కావలసిన అన్ని సౌకర్యాలను కల్పిస్తూ ఉంటుంది. కాని బ్రహ్మచర్యంతోనే ఇద్దఱు కాలం గడపాలి.

భౌతికసుఖాలకు దూరంగా వచ్చారు కాబట్టి వీళ్లు సాధనకోసం చెట్ల క్రిందనే కాలం గడుపుతారు. కొందఱు కుటీరాలు నిర్మించుకొని ఉంటారు. వృద్ధులైన రాజులు రాజ్యభారాన్ని కొడుకులకు అప్పగించి వానప్రస్థులై నగరాలకు బయట వనాలలో నివసించేవారు. ఈ వనప్రస్థధర్మం తీసుకోబోయే సన్న్యాసాశ్రమానికి తొలిమెట్టు.

త్యాగ-వైరాగ్యాలను బాగా సాధనచేసి సాధించుకున్నవాళ్లు సన్న్యాసానికి అర్హులవుతారు. లేకపోతే వనప్రస్థులుగానే జీవితం పూర్తవుతుంది. ఈనాడు ఉద్యోగవిరమణ చేసిన ప్రతివ్యక్తి చేపట్టవలసిన ఆశ్రమం ఇది

**3.4 సన్న్యాసం:**

వానప్రస్థాశ్రమంలో బాగా సాధనచేసి సాధించుకున్న

త్యాగవైరాగ్యాలకు తుదిరూపు సన్న్యాసాశ్రమంలో ఏర్పడుతుంది. అహంకార-మమకారాలు, రాగద్వేషాలు స్వపరభేదాలు అడుగంటి విశ్వంలో భగవంతుని చైతన్యాన్ని విశాలదృష్టితో చూడగలిగినవాడే నిజమైన సన్న్యాసి. జీవరాసులన్నింటిలోను భగవంతుని దర్శనంచేస్తూ ఎక్కడా రాగాన్ని, ద్వేషాన్ని పెంచుకోకుండా సమభావనతో సమాజాన్ని చూడగలుగుతూ తిరిగి తిరిగి ప్రపంచమంతా పర్యటనచేస్తూ పరివ్రాజకుడవుతాడు.

సన్న్యాసి నివృత్తిమార్గంలో ఉంటాడు కాబట్టి విరక్తికి త్యాగానికి ప్రతీకగా ఉండాలి. త్రికరణశుద్ధిగా ఉండాలి ఆయన జీవితం. అలాంటి సన్న్యాసివల్ల ఈ సమాజం స్ఫూర్తిని పెంచుకుంటుంది. జాగృతమౌతుంది. జన్మలను తరింపచేసుకుంటుంది.

**4. గృహస్థాశ్రమం గొప్పదనం:**

సామాజికదృక్పథంతో ఆలోచించినప్పుడు నాలుగు ఆశ్రమాల్లోను గృహస్థాశ్రమం చాలా విశిష్టమైంది. నదీనదాలు సముద్రాన్ని ఆశ్రయించినట్లు ఇతర ఆశ్రమాలు గృహస్థునే ఆశ్రయిస్తాయి. బ్రహ్మచారులు, వనప్రస్థులు, సన్న్యాసులు గృహస్థుల పైనే ఆధారపడి ఉన్నారు. ఒక కుటుంబంలో తండ్రి ఎంత సంపాదించినా పిల్లలను కని, పెంచి విద్యాబుద్ధులు చెప్పించి ఆదరించి ప్రయోజకుల్నిచేసి సంస్కారవంతుల్నిగా రూపొందించడంలో తల్లిపాత్ర ఎంత ఉంటుందో ఆలోచించండి. ఒకరకంగా తల్లినాశ్రయించే పిల్లలు దైహికంగాను, మానసికంగాను సంస్కారవంతులౌతున్నారు. అలాగే ఈ సమాజమంతా గృహస్థులపైనే ఆధారపడి జీవిస్తున్నది చూడండి-

యథా మాతర మాశ్రిత్య సర్వే జీవన్తి జన్తవః।
తథా గృహస్థ మాశ్రిత్య సర్వే జీవన్తి మానవాః॥

1. గృహస్థ ఏవ జయతే గృహస్థస్తప్యతే తపః ।
చతుర్ణామాశ్రమాణాం తు గృహస్థస్తు విశిష్యతే॥ వసిష్ఠస్మృతి 18,14.

కుటుంబంలో తల్లినాశ్రయించి పిల్లలు పెరిగి పెద్దవాళ్ళై జీవిస్తున్నట్లే, సమాజంలోని అన్ని వర్గాలవాళ్ళు, గృహస్థుల నాశ్రయించే బ్రతుకుతున్నారు. అంటే గృహస్థాశ్రమం ఈ సమాజానికి తల్లిలాంటిదన్నమాట.

**5. వివాహమంటే ఏమిటి?**

వివాహమనే పదానికి ఉదాత్త గంభీరమైన అర్థం ఉంది చూడండి.. ఎక్కడో ఒక కుటుంబంలో ఆడపిల్ల పుడుతుంది. ఇంకెక్కడో ఒక మగపిల్లవాడు పుడతాడు. వారి వారి కుటుంబాల స్థితిగతులకు తగినట్లు పెరుగుతారు. విద్యాబుద్ధులు సంపాదిస్తారు. వారిద్దఱిని ఒక చోట కలుపుతుంది ఈ వివాహం.

ఆడపిల్ల తండ్రి, తన కూతురుజీవితమనే లత, ముందుకు సాగి బాగా పాకి విస్తరించడానికి ఘుమ ఘుమలాడే సంతానకుసుమాలను వికసించడానికి ఆధారంగా అల్లుడుగా ఒక మంచి వ్యక్తిని నిర్ణయిస్తాడు. తన కన్యను అతనికి దానంచేసి జీవితాంతం బాగా చూసుకోమంటాడు. అలా వరునికి వధువును అర్పించడం, లేక దానం చేయడమే వివాహం. ధర్మార్థ కామాలనే పురుషార్థాలను సంపాదించడంలో నేనెప్పుడూ ఈమెను అతిక్రమించనని ఈ సందర్భంలో అందఱి ముందు వరుడు ప్రతిజ్ఞ చేస్తాడు. ఇద్దఱి మధ్య ఎవరూ విడదీయలేని దాంపత్యబంధాన్ని ఏర్పరుస్తుంది ఈ వివాహబంధం. దంపతులిద్దఱు ధార్మికమైన భోగాల ననుభవించడంతో పాటు కుటుంబపరంగా సమాజపరంగా తమ బాధ్యతలను గూడ కలసి మెలసి నిర్వహిస్తారు. ఇలా గృహస్థుల జీవితాలను సార్థకం చేసుకోవడానికి తోడ్పడుతుంది వివాహం. వివాహమనేది సంస్కృతపదం. `వహ్' అనే ధాతువుకు ప్రాపణమని అర్థం. ప్రాపణమంటే పొందించడం. `వి' ఉపసర్గ. కన్యాదానం విశిష్టమైన సమర్పణం కాబట్టి `వివాహం' అనే పదం సంగతార్థమైంది.

**6. పర్యాయ పదాలు:**

వివాహమనే పదానికి సంస్కృతభాషలో ఎన్నో పర్యాయ పదాలు

ఉన్నాయి. చూడండి - 1. పరిణయం 2. ఉద్వాహం 3. కల్యాణం 4.పాణిగ్రహణం 5. పాణిపీడనం 6. పాణిబంధం 7. దారోపసంగ్రహణం 8. దారపరిగ్రహణం 9. దారకర్మ 10. దారక్రియ మొదలైనవి. వివాహసమయంలో జరిగే వైదికక్రియలను దృష్టిలో పెట్టుకొనే ఈ పదాలను పర్యాయాలుగా నిర్ణయించారు. తెలుగులో పెండ్లి, పెండిలి, పెళ్లి, మనువు మొదలైనవి పర్యాయపదాలు.

**7. వివాహమెన్ని రకాలు?**

వివాహవ్యవస్థ ఏర్పడినప్పటినుంచి ఇందులో ఎన్నో మార్పులు చేర్పులు వస్తూనే ఉన్నాయి. అందువల్ల వివాహం జరిగే పద్ధతులను బట్టి మనువు దీన్ని తన ధర్మశాస్త్రంలో ఎనిమిది రకాలుగా విభజించాడు. చూడండి-

**బ్రాహ్మో దైవస్తథైవార్షః ప్రాజాపత్యః తథాఽసురః।**
**గాంధర్వో రాక్షసశ్చైవ పైశాచశ్చాష్టమోఽ ధమః॥**

1. బ్రాహ్మం 2. దైవం 3. ఆర్షం 4. ప్రాజాపత్యం 5. ఆసురం 6.గాంధర్వం 7. రాక్షసం 8. పైశాచం అని పెళ్లిళ్లు ఎనిమిది రకాలు.

**7.1 బ్రాహ్మం:**

వరునికుండాల్సిన శుభలక్షణాలన్నీ ఉన్న వాణ్ణి ఆదరంగా ఆహ్వానించి, సకలాభరణభూషితయైన కన్యను అతనికి ఉదక ధారాపూర్వకంగా శాస్త్రీయంగా దానంచేస్తే దాన్ని బ్రాహ్మ వివాహమంటారు. ఇలా దంపతులైన వారికి పుట్టినవాడు తనకు ముందు పదితరాల వఱకు ఉన్న పితృదేవతలను, తన తరువాత పదితరాలలో పుట్టబోయే వారినికూడా పవిత్రుల్ని చేసి స్వర్గసుఖాలనుభవింపజేస్తాడు.

**7.2 దైవం:**

యజమాని యజ్ఞం చేస్తుంటాడు. ఆ యజ్ఞంలో ఋత్విక్కుగా పాల్గొంటున్న వ్యక్తికి అలంకరించిన కన్యను దానంచేస్తే అది దైవమనే వివాహమౌతుంది. ఇలా దైవవివాహం చేసుకున్న దంపతులకు పుట్టిన

పిల్లవాడు ఏడుతరాల ముందు, ఏడుతరాల వెనుకనున్న వాళ్లను తరింపజేస్తాడు. ఇది యజ్ఞయాగాలు ఎక్కువ ప్రచారంలో ఉన్నప్పుడు జరిగిన వివాహవిధి.

**7.3. ఆర్షం:**

వరుని దగ్గఱనుంచి రెండు ఆవులను తీసికొని కూతురి నిచ్చి వివాహం చేస్తే అది ఆర్షవివాహమవుతుంది. ఇలా పెండ్లి చేసుకున్న వారికి కలిగిన సంతానం మూడుతరాలు ముందు, మూడుతరాలు వెనుక నున్న వారిని తరింపజేస్తుంది.

**7.4 ప్రాజాపత్యం:**

"ఇప్పటినుంచి కలసి మెలసి ఉండి గృహస్థాశ్రమ ధర్మాలను చక్కగా నిర్వహించండి" అని ఆదేశించి, "అలాగే శ్రద్ధగా నిర్వహిస్తా" మని దంపతులిద్దఱిచేత ప్రతిజ్ఞ చేయించి వివాహంచేస్తే అది ప్రాజాపత్య వివాహమౌతుంది. ఇలాంటి వారికి పుట్టిన మగబిడ్డ తనను తరింపజేసుకొని ముందు ఆరు తరాలను, వెనుక ఆరు తరాలను తరింపజేస్తాడు.

**7.5 ఆసురం:**

వరుని దగ్గఱనుంచి కన్యాదానం చేసినందుకు ప్రతిఫలంగా డబ్బు తీసుకొని అంటే, కన్యాశుల్కం వసూలుచేసి అతనికి కన్యనిస్తే అది ఆసురమనే వివాహమౌతుంది. అలా దంపతులైన వారికి పుట్టినవాడు ఎవరినీ తరింపజేయలేడు.

**7.6 గాంధర్వం:**

యువతీయువకులు పరస్పరానురాగాన్ని పెంచుకొని, పెద్దలకెవరికి తెలియనివ్వకుండా రహస్యంగా చేసుకొనే వివాహం గాంధర్వ వివాహం. ఇలాంటి వివాహం కేవలం భౌతికదృష్టివల్ల ఏర్పడేదేగాని అందులో ధార్మిక దృష్టికి అవకాశం లేదు. దీనివల్ల ముందు వెనుక తరాలేవి తరించవు సరిగదా! ప్రస్తుతం జరుగుతున్న తరానికి గూడా మనశ్శాంతి ఉండదు. దాంపత్యం కూడా సమంగా సరసంగా ఉండడం అరుదు.

ఇలాంటి వివాహాలవల్ల సమాజగమనం దెబ్బతింటుంది. అది రాజులకు ఆపద్ధర్మంగా అంగీకరింపబడింది.

### 7.7 రాక్షసం:

వివాహానికి ముందు కన్యకు సంబంధించినవారితో యుద్ధం జేసి, కన్యను అపహరించి ఎక్కడికో తీసుకువెళ్ళి చేసుకొనే వివాహం రాక్షస వివాహం. రాక్షసవివాహం కూడా సర్వసాధారణం కాదు. క్షత్రియులకు మాత్రమే పరిమితమైనది. పరాక్రమాన్ని పణంగా పెట్టి కన్యనపహరించి వివాహం చేసుకోవటం క్షత్రియుడికి మాత్రమే చెల్లుతుంది. ఇందులోను ధార్మికదృష్టి కంటే భౌతికదృష్టే అధికం.

### 7.8 పైశాచం:

కన్యపై మనసుపడితే ఆమె నిరాకరిస్తుంది. తరువాత మాయతో ఆమెకు నచ్చినవాడి వేషంలో వచ్చి మోసగించి పెళ్ళి చేసుకోవడం పైశాచం. అలాగే కన్య నిద్రిస్తున్నప్పుడు బలాత్కరించి శీలాన్ని అపహరించి పెళ్ళిచేసుకోవడం కూడా పైశాచమే అవుతుంది. ఇది చాలా నీచమైన వివాహం. మాయతో మోసంతో ఏర్పడిన దాంపత్యం మోహం తీరేదాకానే గాని ఎంతోకాలం నిలవదు. పవిత్రమైన బంధం కాదు కాబట్టి పదిమంది చేసే అవమానాలకు ఈ వివాహం పాత్రమౌతుంది.

## 8. వివాహప్రశంస:

తనకు శరీరాన్నిచ్చిన తల్లిదండ్రులకు, జ్ఞానాన్నిచ్చిన ఋషులకు జీవితం సాగించడానికి మంచి వనరుల నందించిన దేవతలకు మానవుడు పుడుతూనే ఋణపడుతున్నాడని ఇదివఱకే చెప్పాను. అందులో పితరుల ఋణాన్ని తీర్చుకోవడానికే ప్రధానంగా వివాహం ఉద్దేశింపబడింది. మిగతా రెండు ఋణాలను గూడ గృహస్థాశ్రమంలో తీర్చుకోవచ్చు.

సామాన్యంగా వివాహమనే నియమం ఉంది కాబట్టే ఈ సమాజం ఇంత ఆరోగ్యంగా ఉండి, మానవజాతి బుద్ధిబలంతో అభివృద్ధి జెందుతున్నది. అలాకాక స్త్రీపురుషులకు వివాహబంధం లేకపోతే లోకమెంత

అస్తవ్యస్తమైపోతుందో ఊహకందని విషయం. ఆత్మసంస్కారం పెరగడానికి ఆదర్శజీవితం గడపడానికి మానవజాతికి ప్రత్యక్షంగాను, పరోక్షంగాను వివాహం ఎంతో దోహదం చేస్తున్నది. పురుషుడికిగాని, స్త్రీకిగాని వివాహం జరిగితేనే పరిపూర్ణత సిద్ధిస్తుంది. అంతవఱకు వాళ్ళ జీవితం ఏదో కొఱతతోనే ఉంటుంది. సమాజంలో ఎన్ని ఒడుదుడుకులున్నా సర్దుకుపోయే మనస్తత్వం ఏర్పడి ఇంతో అంతో శాంతి ఏర్పడుతున్నదంటే అది స్త్రీ పురుషుల వివాహబంధం వల్ల ఏర్పడిన, సదవగాహన, సంతతి మొదలగు వాటివల్లనేగాని ఇంకొకదానివల్లకాదు.

**9. కన్యాలక్షణాలు:**

వివాహం చేసుకోబోయే కన్యలో ఉత్తమ సాముద్రిక లక్షణాలు, మంచిదేహపుష్టి, వర్చస్సు ఉండాలి. ఆమెకు అన్నదమ్ములు, అక్క చెల్లెళ్లు ఉండటం చాలా మంచిది. దీనివల్ల వరునికి మంచి సంతానం కలిగి వంశవృద్ధి అవుతుందని పెద్దలు చెబుతారు.

కన్య వరునికి సోదరివరుస కాకూడదు. వరునికి భిన్నగోత్రంలో పుట్టి ఉండాలి. ఇలాంటి విషయాలను పరీక్షించి కన్యను ఎన్నుకున్నట్లైతే ఆమెకు కలిగే సంతానం ఆరోగ్యంతో కళకళలాడుతూ ఉంటుంది. ఆ వంశం మూడు పువ్వులు ఆరు కాయలుగా వృద్ధిపొందుతుంది.

కన్యను చూడటానికి వరుడుగాని అతనికి సంబంధించిన వాళ్లుగాని వెళ్లినప్పుడు ఆమె నిద్రపోతూ ఉన్నా, ఇంట్లో లేకపోయినా, దుఃఖంతో

---

2. సంతుష్టో భార్యయా భర్తా భర్త్రా భార్యా తథైవ చ।
యస్మిన్నేవ కులే నిత్యం కల్యాణం తత్ర వై ధ్రువమ్॥
మనుస్మృతి 3.60.

3. అనిందితైః స్త్రీవివాహై రనింద్యా భవతి ప్రజా।
నిందితై ర్నిందితా నృణాం తస్మాన్నింద్యాన్ వివర్జయేత్॥
అందులోనే 8.48.

4. 'అసమానప్రవరైర్వివాహః' గౌతమధర్మసూత్రం 4.2.

ఉన్నా ఆ సంబంధాన్ని వదిలేయడం మంచిది. అంతేగాక క్రింద వివరించబోయే 1. గుప్త, 2. ఋషభ, 3. శరభ, 4. వినత, 5. వికట, 6. ముండ 7. మండూషిక, 8. సాంకరిక, 9. రత, 10. పాలి అనే కన్యలను గూడా వదిలి పెట్టడం మంచిది.

**1. గుప్త:** తల్లిదండ్రులు నిర్బంధించి ఇంట్లో రహస్యంగా దాచిన కన్యను పెండ్లి చేసుకోగూడదు.

**2. ఋషభ:** మోటుశరీరం, లావైన వెంట్రుకలు, కలసిన కనుబొమ్మలు, పిక్కలమీద వెంట్రుకలు, కాలి చిటికినవ్రేలు నేలపై ఆనక పోవడం, మొగవాడిగొంతు, కండ్లు ఆర్పటం, నవ్వినపుడు కళ్లు మూయటం, బుగ్గలు సొట్టబడటం మొదలగు లక్షణాలుగల కన్య ఋషభ. ఈమెవల్ల సంసారం వృద్ధికాదు.

**3. శరభ:** అతి సౌందర్యవతి, వేశ్యాలక్షణాలతో అమితమైన కాముకత్వాన్ని ప్రదర్శించేది, ఇతరులను ఆకర్షించడానికే ఎప్పుడూ అనేకాలంకారాలను చేసుకొనేది శరభ. ఇలాంటిదాని వల్ల సంసారంలో సుఖశాంతులుండవు.

**4. వినత:** గూనితనం, మెడ, నడుము వంగిపోవడం, ముసలితనపు లక్షణాలు అంకురించడం ఎవరిలో కనపడతాయో ఆమెను వినత అంటారు. అలాంటి స్త్రీలకు సంతానం కలుగదు. అనేక గర్భకోశవ్యాధులువచ్చే అవకాశం ఉంది.

**5. వికట:** నడుము నుంచి మోకాళ్లవరకు ఉన్నభాగంకంటే, మోకాళ్ల నుంచి పాదాల వఱకు గల భాగం పొడుగు ఎక్కువగా ఉండి, పిక్కలు మరీ లావుగా ఉంటే ఆమెను వికట అంటారు. సాముద్రిక శాస్త్రంలో వీళ్లను మూడు రకాలుగా విభజించారు..1. కాకజంఘ (కాకి కాళ్లుకలది) 2. బకజంఘ (కొంగ కాళ్ళది) 3. ఉష్ట్రజంఘ (ఒంటె కాళ్ళది) ఈమె దరిద్రురాలు, దిక్కులేనిది, భర్తకు సంతానానికి దూరంగా ఉండేది అవుతుంది.

**6. ముండ:** అనారోగ్యం వల్ల ఇతర కారణాలవల్ల, జుట్టుతీసివేసినదాన్ని ముండ అంటారు.

**7. మండూషిక:** పొట్టిగా ఉండి గరుకైనచర్మం కలది మండూషిక అవుతుంది.

**8. సాంకరిక:** వంశం వగైరా తెలియనిది, విభిన్న సంప్రదాయాలు గల స్త్రీ పురుషలకు పుట్టినది సాంకరిక.

**9. రత:** మంచి అలవాట్లుగాని, పరిశుద్ధిగాని లేని కుటుంబంలో పుట్టినది. కామాధిక్యంవల్ల మలినప్రవృత్తికి అలవాటుపడినది. అశ్లీల సాహిత్యంపైన సంభాషణలపైన మోజుపడేది రత.

**10. పాలి :** దాసీవృత్తితో పిల్లలను పెంచడం జీవనంగా కలది పాలి. అలాగే 1. మిత్ర, 2. వర్షకరి, 3. నక్షత్రనామ, 4. నదీనామ, 5.వృక్షనామ, 6. రేఫోపధ అనే కన్యలను గూడ పరిగ్రహించకూడదు.

**1. మిత్ర:** ఎక్కువమంది మొగవాళ్ళతో స్నేహం చేసేది మిత్ర.

**2. వర్షకరి:** వరునికంటే వయసులో పెద్దది వర్షకరి. అలాగే ఎప్పుడూ చెమటలు పోసే శరీరం కలది కూడ వర్షకరి.

**3. నక్షత్రనామ:** నక్షత్రాలపేరుతో పిలువబడేది నక్షత్రనామ. రోహిణి, ఉత్తర, అనూరాధ మొదలైనవి.

**4. నదీనామ:** నదిపేరుగల కన్య నదీనామ. గంగ, కృష్ణవేణి, గోదావరి, యమున మొదలైనవి.

**5. రేఫోపధ:** పేరులో చివరి అక్షరానికి ముందుఅక్షరం ఉపధ. రేఫం ('ర ')గాని లకారంగాని ఉపధగా ఉండే పేరుకలది. సరళ, శాలిని మొదలైనవి. ఇలాంటి కన్యలను పెండ్లి చేసుకోకూడదు. ఈదోషాలు లేకుండా చూసుకొని సంబంధాన్ని నిశ్చయం చేసుకోవాలి.

**10. వరలక్షణాలు:**

వరుడు మంచివంశంలో పుట్టి కులీనుడై ఉండాలి. బంధుసంపత్తి కలవాడై, పదిమంది మెచ్చే స్వభావం కలవాడై ఉండాలి. సాముద్రిక శాస్త్రలక్షణయుక్తుడై ఆరోగ్యంగా ఆహ్లాదంతో ఉండేవాడు కావాలి. దత్తతకు

వెళ్ళినవాడు, దర్శనీయుడుగా లేనివాడు, సగోత్రుడు సంబంధానికి సరిపోడు. సౌందర్య సౌశీల్యాలతో యువకుడైన వాడిని వరునిగా ఎన్నుకోవాలి.

**11. "నాతిచరామి"**

కన్యాదానం చేస్తూ పిల్ల తండ్రి అల్లుడితో ఇలా చెబుతాడు-

**అష్టవర్షా౽భవత్కన్యా పుత్రవత్పాలితా మయా।**
**ఇదానీం తవ దాస్యామి దత్తాం స్నేహేన పాలయ॥**

"నాయనా! ఎనిమిదేండ్లు నిండిన ఈ పిల్లను, కొడుకును పెంచినట్లు అల్లారుముద్దుగా పెంచాను. ఇప్పుడు నీచేతిలో పెడుతున్నాను. నీవీమెను స్నేహంతో చూసుకోవాలి.

ఇలా చెప్పి "జీవితంలో మీరిద్దఱు కలసి మెలసి ఎన్నో మధురానుభూతులను పొందాలి. మంచి పనులను చేయాలి. సిరిసంపదల ననుభవించాలి. సత్సంతానాన్ని కనాలి. ధర్మార్థకామాలనే పురుషార్థాలను సంపాదించుకోవడంలో ఈనాడు నీకు అర్ధాంగి అయిన నా కూతురును నిరాదరించకు ! మోసం చేయకు! అతిక్రమించి వెళ్ళకు! అలా ఎన్నటికీ చెయ్యనని నాకు మాట ఇవ్వు!" అని అంటాడు. దానికి సమాధానంగా పెండ్లికొడుకు "ఈమెను అతిక్రమించనని మీకు మాట ఇస్తున్నా" నంటాడు. జీవితంలో వేసే ప్రతి అడుగులో నిజంగా ఆ మాటను గుర్తుపెట్టుకొని ప్రతివాడు నిలబెట్టుకోవడానికి ప్రయత్నిస్తే దాంపత్యం ఒక మధురానుభూతిగా మిగిలిపోతుంది.

**12. భర్త ప్రేమను పొందాలంటే:**

తను కన్యాదానం చేసి అత్తవారింటికి పంపిన ఆడపిల్ల అక్కడ అల్లుడిప్రేమకు ఆటపట్టై సుఖంగా కాపురం చేసుకోవాలని ప్రతి తండ్రి అభిలషిస్తాడు. అలా ఆ పిల్ల జీవితం మూడు పువ్వులు ఆరు కాయలుగా కళకళలాడుతూ ఉండాలంటే స్వాతీనక్షత్రంలో కన్యాదానం చేయాలి. అలా చేస్తే ఆమె సకల సౌభాగ్యాలతో అత్తవారింట ఆనందంగా

ఉంటుంది. ఆశ్రయం లేకగాని అవమానభారంతోగాని తిరిగి ఆమె అత్తవారింటి నుంచి పుట్టింటికి వచ్చే అవసరమే రాదని తైత్తిరీయ బ్రాహ్మణం (15-2) ఇలా వివరిస్తున్నది చూడండి.

**యాం కామయేత దుహితరం ప్రియా స్యాదితి తాం।**
**నిష్ట్యాయాం దద్యాత్ ప్రియైవ భవతి. నైవ తు పునరాగచ్ఛతి॥**

వివాహముహూర్తాలు పెట్టుకొనే ముందు ఆ నక్షత్రానికి సుముహూర్తం కుదురుతుందా? అని కన్యాదాతలు విచారించుకొని కుదిరితే అలా చేయవచ్చు.

**13. త్వరగా పెళ్ళి కావాలంటే..**

ఆడపిల్లకు పెళ్ళికావడం జీవితంలో ఒక పెద్ద మలుపు. యోగ్యుడైన వరుడు లభించడం ఆలస్యమైతే ఈ క్రింది మంత్రంతో త్ర్యంబకుణ్ణి ఆరాధిస్తే మంచి వ్యక్తి భర్తగా లభిస్తాడని శుక్ల యజుర్వేదం **(3-60)** చెబుతున్నది.

**త్ర్యంబకం యజామహే సుగన్ధిం పతివేదనమ్।**
**ఉర్వారుకమివ బన్ధనాదితో ముక్షీయ మాముతః॥**

దివ్యమైన సుగంధం గల త్రినేత్రుని ఆరాధిస్తున్నాను. ఆయన దయవల్ల నేను పెండ్లై పుట్టింటినుంచి త్వరగా అత్తవారింటికి వెళ్ళిపోవాలి. మళ్ళా భర్తనుంచి ఎన్నటికి విడిపోకూడదు. ఆ గోత్రంతో భర్తతోనే సుఖంగా ఉండాలి.

ఈనాడు పెళ్ళి ఆలస్యమైన ఆడపిల్లలకిది మహామంత్రం. దీన్ని రోజు నియమంతో చదువుతూ త్ర్యంబకుణ్ణి ఆరాధన చేస్తే వాళ్ళ అభీష్టం త్వరలో నెరవేరుతుంది.

**14. ఏడు జన్మల బంధం:**

"పెళ్ళన్నది నూరేళ్ళ పంట" అంటారు పెద్దలు. అంతేకాదు నిజమాలోచిస్తే అది ఏడు నూర్లపంట అని తేలుతున్నది. భార్యాభర్తల సంబంధం వద్దనుకున్నా వదిలిపోయేదికాదు. అది ఏడేడు జన్మల

బంధం. ఒక్కసారి భార్యాభర్తలైనారంటే అది అంతటితో పోదు. ఏడు జన్మలవఱకు అలాగే కొనసాగుతుంది. ఇద్దఱు కలసి చేసిన అదృష్టాలను బట్టే సంతానం కలగటం, కలగకపోవటం, కలిగినా మంచి సంతానం, కలగటం లేక అంగవికలురు పుట్టటం మొదలైనవి అన్నీ సంభవిస్తుంటాయి. కాబట్టి పరిస్థితుల ప్రభావం వల్ల ఇద్దఱి మధ్య ఆవేశాలు, పట్టుదలలు పెరిగినా ఇది శాశ్వతబంధమనే సత్యాన్ని గుర్తించి పట్టింపులు పెంచుకోక వాటిని సర్దుకు పోవటం భార్యాభర్తలు నేర్చుకోవాలి. అలా సర్దుకు పోవడంలోనే దాంపత్యం పండుతుంది. ఆనందం నిండుతుంది. నేను మొగవాణ్ణి నాకేం? అని భర్త: నేను అర్ధాంగిని కాదా ఔనా? అని భార్య భీష్మించుక్కూర్చుంటే పక్కవాళ్ళు తలా ఒక పుల్లా వేస్తారేగాని ఎవ్వరూ సరిదిద్దలేరు. ఇద్దఱు సమానులేగాని ఎవ్వరూ తక్కువ గాని ఎక్కువగాని కారు. జీవితరథానికి ఇద్దఱు రెండుచక్రాలే. కనుక దంపతులు వాళ్ళ సమస్యలను అనురాగంతో దూరదృష్టితో వాళ్ళే పరిష్కరించుకోవాలి. ఇతరులమీద ఆట్టే ఆధారపడకూడదు.

**15. సమాజసేవ:**

గృహస్థులపైన సమాజబాధ్యత లెన్నో ఉన్నాయని ఇదివఱకే వివరించాను. సమాజపరమైన బాధ్యతలను నిర్వహించడానికి అర్ధాంగి నిజమైనతోడుగా నీడగా వ్యవహరించాలి. భార్య సహకారం లేందే భర్త ఒక్కడూ ఈ సమాజానికి ఏమీ చేయలేడు. అలాగే భర్త సహాయంలేందే భార్యకూడా. కనుక తమ జీవితం ఈ సమాజసేవకు అంకితం చేయాలనే దృఢసంకల్పం ఇద్దఱి మనస్సుల్లోను ఏర్పడాలి. దంపతులందఱు అలా నడుం కట్టినప్పుడు సమాజం నిత్యకల్యాణం పచ్చతోరణంగా ఉంటుంది.

నిస్స్వార్థంగా సమాజసేవచేసే దంపతులకు ఆరోగ్యం, మనశ్శాంతి. ఆదరణ, కీర్తి, ప్రతిష్ఠ అన్నీ అయాచితంగా లభిస్తాయి నిష్కామసేవ చేసే ఆ దంపతులను ఈ సమాజం ఆదర్శంగా తీసికొని చరిత్రపుటల్లో

సువర్ణాక్షరాలతో వారిని గుర్తుపెట్టుకొంటుంది. కాబట్టి స్వప్రయోజనాలకంటే స్వంతసుఖంకంటే, మానవసేవ చేయటానికే కొత్తదంపతులు కొంగు ముడి వేసుకోవాలి. అప్పుడు వాళ్ళకు మాధవానుగ్రహం తప్పక లభిస్తుంది. వాళ్ళ జీవితలతలు మూడు పువ్వులు ఆరు కాయలుగా ముందు ముందుకు సాగిపోతాయి.

**16. పరిణయంతోనే పరిపూర్ణత:**

స్త్రీకి గాని పురుషుడికి గాని జీవితంలో పరిపూర్ణత పరిణయంతోనే సిద్ధిస్తుంది. వాళ్లెంత గొప్పవాళ్లైనా కావచ్చుగాని, సమాజంలో సహజీవనం చేసేటప్పుడు వివాహం వాళ్ళకొక వైలక్షణ్యాన్ని సంతరిస్తుంది. కేవలం ప్రవృత్తిమార్గం అక్కర్లేదనుకొని నివృత్తిమార్గంలో నిలబడిపోయిన ఆధ్యాత్మిక సంపన్నులను వదిలేస్తే ఇది అందరికి తప్పనిసరి అనిపిస్తుంది. చూడండి శతపథబ్రాహ్మణం (5.2.1.10) ఏమని చెబుతున్నదో..

**అర్ధో హ వా ఏష ఆత్మనో యజ్జాయా. తస్మాద్యావ జ్జాయాం న విన్దతే నైవ తావత్ ప్రజాయతే. అసర్వో హి తావద్భవతి. అథ యదైవ జాయాం విన్దతే అథ ప్రజాయతే, తర్హి హి సర్వో భవతి.**

భార్య భర్తలో సగభాగం. ఆమెను పొందేదాకా అతడు సంతానాన్ని కనలేడు. అంతవరకు అతనిలో పరిపూర్ణత లేదు. పెండ్లి చేసికొని సంతానాన్ని కన్నవాడే పరిపూర్ణుడౌతాడు.

పురుషుని వ్యక్తిత్వం, సంపూర్ణం కావాలంటే రెండో సగమైన భార్యతో కలసి సంతానాన్ని పొందితీరాలి. అపుడే అతడు పరిపూర్ణుడవుతాడు.

5. ఇంకా వివరాలకు చూడండి; అర్ష విజ్ఞానసర్వస్వం, రెండవ సంపుటం, పుట 56-57 తిరుమల తిరుపతి దేవస్థాన ప్రచురణ, తిరుపతి.

**17. అర్ధాంగి:**

స్త్రీ పురుషులిద్దఱు ఎక్కడెక్కడో పుట్టినా, విభిన్న వాతావరణంలో పెరిగినా వివాహం ద్వారా వాళ్లు దగ్గఱౌతూ ఒకటౌతున్నారు. వారి భావనలు, అనుభూతులు ఒకటౌతున్నాయి. భగవంతుని నిర్ణయం ప్రకారం ఎవరెవరు ఏ జన్మలో భార్యభర్తలు కావాలో అలాగే వాళ్ళు దగ్గఱౌతున్నారు. అందుకే మన నిర్ణయం ప్రకారం ఏమి జరుగదు; "వివాహాలు విధినిర్ణీతాలు" (marriages are made in heaven) అంటారు పెద్దలు. దంపతులిద్దఱికి శరీరాలు వేరైనా, మనసు, మమత ఒక్కటిగానే ఉండాలి. అప్పుడే వాళ్ళు దాంపత్యసారమైన ప్రేమను అనురాగాన్ని అనుభవించగలుగుతారు. ఈ జీవితయజ్ఞాన్ని ఇద్దఱూ కలసి అనుష్ఠించాలి. భర్తలో భార్య సగభాగమని తై.బ్రా.(3.3.3.) ఇలా చెబుతున్నది-"అర్ధో వా ఏష ఆత్మనః యత్పత్నీ". అలాంటి దాంపత్యంలోనే స్త్రీకి అర్ధాంగిగా ఉన్నతస్థానం ఉంటుంది. భర్తకు సంబంధించిన హక్కులలో అర్ధాంగి కావచ్చుగాని, బాధ్యతలలోకూడా తన అర్ధాంగిత్వాన్ని నిలుపుకోవడం అంత తేలికైన పనికాదు. ధర్మపత్నిగా ఆయనకు సంబంధించిన అన్ని వ్యవహారాలను తను స్వయంగా విచారించుకోవలసిన అవసరం ఉంది. అలాగే ఆయనను అనుసరించి అర్థం చేసుకొని మనసులో మనసై, తనువులో తనువై ప్రతి నారీమణి నడవగలిగితే నిజమైన అర్ధాంగిగా రూపొంద గలదనేది నగ్నసత్యం[6]. వరుడు వివాహ కాలంలో వధువుతో ఏమంటున్నాడో ఛాందోగ్య బ్రాహ్మణంలో (1.3.9.)చూడండి..

> యదేతద్ధృదయం తవ తదస్తు హృదయం మమ।
> యదిదం హృదయం మమ తదస్తు హృదయం తవ॥

నీ హృదయం; అంటే నీ అభిలాష నాది కావాలి. అలాగే నా హృదయం నీది కావాలి. అంటే ఏమిటి? ఇద్దఱి మనసులు ఒకటిగా చేరిపోవాలి. ఇద్దఱి ఆలోచనలు ఒకటిగా ఏర్పడాలి.

---

6. కార్యేషు దాసీ కరణేషు మంత్రీ రూపే చ లక్ష్మీః క్షమయా ధరిత్రీ।
భోజ్యేషు మాతా శయనేషు రంభా షాడ్గుణ్యయుక్తా కులధర్మపత్నీ॥

## 18. స్త్రీ గౌరవం:

అది కుటుంబమైనా, గ్రామమైనా, రాష్ట్రమైనా, దేశమైనా స్త్రీని గౌరవిస్తేనే దాని గౌరవం ఇనుమడిస్తుంది. స్త్రీని అవమానించినా, అత్యాచారం జరిపినా, ఆ దేశం పైకి రాదు. అయితే స్త్రీలు కూడా చాంచల్యం లేకుండా మధురగంభీరస్వభావంతో మనుగడసాగిస్తూ మగవారి మన్ననలకు పాత్రులుకావాలి. తమ ఉన్నతమైన వ్యక్తిత్వం, ఉత్తమసంస్కారం, ఉజ్జ్వలమైన శీలమే కుటుంబానికి దేశానికి కూడా గర్వకారణమౌతాయని మరచిపోకూడదు.

ఏ కుటుంబంలో స్త్రీలు పూజింపబడతారో అక్కడ దేవతలు విలసిల్లుతుంటారు. సకలసంపదలు నెలకొని ఉంటాయి. ఏ ఇంట్లో స్త్రీలు అవమానానికి గురౌతుంటారో అక్కడ జరిగే ప్రతిపనీ వ్యర్థమైపోతుంది. ఆ సంసారం అభివృద్ధికిరాదని ఇలా అంటాడు మనువు..

**యత్ర నార్యస్తు పూజ్యంతే రమన్తే తత్ర దేవతాః।**
**యత్రైతాస్తు న పూజ్యంతే సర్వాస్తత్రాఫలాః క్రియాః॥**

స్త్రీలు ఎప్పుడూ దుఃఖపడుతూ ఉండే కులం వెంటనే నశిస్తుంది. స్త్రీలు ఏ దుఃఖంలేకుండా, ఎప్పుడూ సంతోషంగా ఉండే కులం మాత్రమే దినదినాభివృద్ధి చెందుతుందని ఇలా చెబుతాడు మనువు-

**శోచంతి జామయో యత్ర వినశ్యత్యాశు తత్కులమ్।**
**న శోచంతి తు యత్రైతా వర్ధతే తద్ధి సర్వదా॥**

అందువల్లనే స్త్రీలకు అవకాశమేర్పడినప్పుడల్లా ఆభరణాలు, అలంకారాలు, కొత్తబట్టలు, తినుబండారాలు మొదలైనవి ఇస్తూ, వాళ్ళను గౌరవించాలి. దానివల్ల కుటుంబం బాగా అభివృద్ధి చెందుతుంది.

కుటుంబాభివృద్ధిని, దేశాభివృద్ధిని కోరే భర్త ఎప్పుడూ తన భార్యను తనతో సమానంగా చూడాలేగాని, తక్కువగా చూడకూడదు. స్త్రీని అగౌరవంచేసినా, అవమానంచేసినా ఆ దేశం సర్వనాశనమౌతుంది.

మన ఇతిహాసపురాణాల్లో కూడా స్త్రీని అవమానించిన దుర్మార్గులు నామరూపాలు లేకుండా పోయారు.

**19. మకుటంలేని మహారాణి:**

మెట్టినింటిలో నిజంగా స్త్రీ మకుటంలేని మహారాణి. కుటుంబగౌరవ ప్రతిష్ఠలు కుసుమకోమలియైన ఇల్లాలివల్లనే వృద్ధిపొందాలి. వివాహమైన స్త్రీ భర్త కుటుంబాన్ని అన్ని విధాలా తీర్చిదిద్దవలసిన స్థానంలో ఉంటుంది. భార్యగా, కోడలుగా, వదినగా, తల్లిగా తన ఇంట్లో స్త్రీ నిర్వహించే బాధ్యతలు, ఆమె కెంతో ఉన్నతస్థానాన్ని ఏర్పరచినాయి. వివాహసమయంలో వరుడెలా వధువును ఆదేశిస్తాడో ఛాందోగ్యబ్రాహ్మణం (1.2.20.) వివరిస్తున్నది చూడండి-

**సమ్రాజ్ఞీ శ్వశురే భవ, సమ్రాజ్ఞీ శ్వశ్ర్వాం భవ।**
**ననాందరి సమ్రాజ్ఞీ భవ, సమ్రాజ్ఞీ అధిదేవృషు॥**

అత్తవారింట్లో అత్తమామలు, ఆడుబిడ్డలు, బావలు, మఱుదులు, మొదలైన వారందఱిని ప్రేమానుబంధంతో చక్కగా చూసుకుంటూ ఇంటికి దీపంలాగా యజమానురాలివై ఉండు!

క్రమశిక్షణతో క్రమక్రమంగా వృద్ధికొస్తున్న కుటుంబంలో యజమానురాలుగా స్త్రీ అందఱికీ తగిన సౌకర్యాలు కలుగజేస్తూ వారి ప్రేమాభిమానాలను చూరగొనగలుగుతుంది.

**20. గృహపత్ని:**

గృహసామ్రాజ్యాన్ని అహంకారంతో గాక ఆప్యాయతతో పాలించే అనురాగదేవతకూడా స్త్రీమూర్తియే. మనిషిలో నమ్రత, మాటలో ఆదరణ, మహిళాలోకానికి వన్నె తెస్తాయి. అలాంటి మహిళాశిరోమణి గృహలక్ష్మి అయితే పాలుపొంగినట్లు ఆ కుటుంబం అన్ని విధాలా ఆ అభ్యుదయపథంలో ప్రకాశిస్తుంది. "నీవే నా ఇంట్లో వాళ్ళందఱకు పరిపాలకురాలివి" అని వివాహసందర్భంలో వరుడు చెప్పే మంత్రాలు చూడండి-

**స్నుషాణాగ్ం శ్వశురాణాం ప్రజాయాశ్చ ధనస్య చ।**
**పతీనాం చ దేవృణాం చ సజాతానాం విరాడ్భవ॥**

తోడికోడళ్లను, అత్తమామలను, నీసంతానాన్ని సిరిసంపదలను, భర్తను, బావలను, మఱుదులను, మా వంశంలోని వాళ్ళందఱిని, చక్కగా ఆదరంతో చూస్తూ యజమానురాలివిగా మంచిపేరు సంపాదించు!

**ఇహ ధృతిరిహ స్వధృతిరిహ రన్తిరిహ రమస్వ।**
**మయి ధృతిర్మయి స్వధృతిర్మయి రమో మయి రమస్వ॥**

ఓ కన్యా! నీవు ఈ ఇంట్లో ధైర్యస్థైర్యాలతో ఉండు! ఇక్కడే నాతో విలాసంగా కాలం గడుపు. నీకు నీవాళ్లకు నేనంటే ప్రసన్నభావం ఉండాలి. నాతో అనురాగంతో మెలగు.

**21. మగపిల్లవాడే పుట్టాలి:**

ఆనాడు కూడా ఇప్పటిలాగానే పురుషసంతతిమీద అభిమానం ఎక్కువ అని ఛాందోగ్యబ్రాహ్మణం(1.4.8.9.) చెబుతున్నది. వరుడు ఇలా కోరుతున్నాడు. మిత్రావరుణులు, అశ్వినీదేవతలు, అగ్ని, వాయువు, ఇంద్రుడు, బృహస్పతి, వీళ్లందఱు పురుషులే. అలాగే నీవూ మగబిడ్డను కనాలి. తరువాత పుట్టే బిడ్డకూడా మగబిడ్డే కావాలి.

**22. సమభావన :**

ఎక్కడినుంచో వచ్చిన ఆడపిల్లకదా!అని భార్యను బానిసగా చూడటం, తన కుటుంబమంతా కట్టకట్టుకొని కక్షసాధిస్తుంటే చూస్తూ ఏమీ పట్టనట్లు కూర్చోవటం భర్త చేయవలసిన పనికాదు. "అందరినీ వదిలి తన చేయి పట్టుకొని సహధర్మచారిణిగా తన ఇంటికి వచ్చిందన్న భావన అతనిలో ఎప్పుడూ ఉండాలి. ఆమె కంటనీరు పెట్టకుండా ఎంతో జాగ్రత్తగా తను వ్యవహరిస్తూ ఇతరులు కూడా అలాగే ఉండేటట్లు చూసుకోవలసిన భారం మొగవాడిమీద ఉన్నది. "కలకంఠి కంట కన్నీరొలకిన సిరి ఇంట నుండనొల్లదు" అని కదా! పెద్దలు చెబుతారు.

దంపతులిద్దఱు సంసారమనే బండికి చక్రాలాంటివాళ్ళు. రెండు చక్రాలు సమానంగా ఉంటేనే బండి సరిగా నడుస్తుంది. ఒక చక్రం చిన్నది; ఇంకో చక్రం కొంచెం పెద్దది అయితే బండి సరిగా నడవదు. అలాగే దంపతులిద్దఱు ఎక్కువ తక్కువలు లేకుండా సమానంగానే ఆలోచించాలి. సంసారప్రణాళికను రూపొందించుకోవాలి. శ్రద్ధతో అమలుపరచాలి. హక్కులకోసం పోరాడకుండా బాధ్యతలను పంచుకోవాలి. అప్పుడే సంసారగమనం సరిగమలు లేకుండా సరసంగా సాగుతుంది.

**23. వంశవృద్ధి:**

బ్రహ్మచర్యంలో చక్కని విజ్ఞానాన్ని సంపాదించి, ధర్మబద్ధంగా వివాహం చేసికొని సమాజసేవాభావంతో దంపతులిద్దఱు తమ జీవితాలను సార్థకం చేసుకోవాలి. భార్యాభర్తలు భోగంలో కాదు పోటీ పడవలసింది త్యాగంలో యోగంలో పోటీపడాలి. యోగమంటే సమత్వం, క్రియానిర్వహణ సామర్థ్యం. ధర్మానికి విరుద్ధంకాని అర్థకామాలను అనుభవించవచ్చు. కాని జీవితలక్ష్యం అర్థసంపాదనం, కామపరిపూరణం కాకూడదు. భగవంతుడిచ్చిన ఇంద్రియశక్తుల్ని మానవుడు అనర్థాలకు ఆలవాలమైన అర్థార్జనం కోసం అంకితం చేసి చివరకు తెలుసుకుంటాడు. తానెంత జీవితాన్ని వ్యర్థం చేసుకున్నాడో:అప్పుడు తెలుసుకొని ఏం ప్రయోజనం? గతజలసేతుబంధనం తప్ప. అలాగే నీతినియమాలను వదిలేసి అంతులేని కామాలకు, కామాలు పెట్టుకుంటూ పోయి అన్నివిధాలా అశక్తుడైననాడు గ్రహిస్తాడు తానేమి పోగొట్టుకున్నది. తనను తానే గర్హించుకుంటాడు. ఏమిటి ప్రయోజనం? అంతా పూర్తయిపోయిన తరువాత.

అందుకే ముందుజాగ్రత్త అన్నింట్లోను మంచిది. మానవజన్మ చాలా దుర్లభమైంది. ఎంతో విలువైంది. దీన్ని సద్వినియోగం చేసుకోవాలి. ఈ సమాజానికి ఎంతో కొంత సేవచేసి ఆదర్శంగా బ్రతికి మంచి సంతానాన్ని ఈ సమాజసేవకు అర్పించాలి. అదే గృహస్థాశ్రమం స్వీకరించిన నూతన దంపతుల భావిజీవితలక్ష్యం కావాలి. ఆనాడే ఈ సమాజం సమసమాజమౌతుంది. శాంతిమందిరమౌతుంది. అదే ఏనాటికి తిరుగులేని సత్యం శివం సుందరం.

***

# సప్తపది

## రెండవభాగం

### 1. వివాహవిజ్ఞానం:

సామాన్యంగా ఈరోజుల్లో వివాహాలు జరిగేటప్పుడు : తరపు కుటుంబసభ్యులు ఇచ్చిపుచ్చుకోవడం వంటి గొడ: హడావిడిలో వారుంటారు. బంధువులు లోకవ్య' మాట్లాడుకుంటూ, కొత్తపరిచయాలు పెంచుకుంటూ : ఎప్పుడైపోతుందా అని ఎదురు చూస్తుంటారు. ఇతరులు భోజ పిలవరేమిటని దిక్కులు చూస్తుంటారు. వధూవరులు పు చెప్పేమాటలు, మంత్రాలు అర్థంకాక, ఏమిచేయలేక : పీటలమీద కూర్చొని ఉంటారు. పీటలమీద కూర్చోవ ఆలస్యమైనా కొందఱు జబరదస్తీ చేస్తూ గడియారాలు చూ "ఇంకెంతసేపయ్యా పంతులూ! తొందరగా కానీ!" అని పు తొందరపెడుతుంటారు. పెళ్ళిపెద్దలతో రాజీపడి పురోహితు శ్రద్ధ లేనప్పుడు నాకు మాత్రం ఏం పట్టిందని" వివాహంలో : తంతుమాత్రం నడుపుతూ వాయువేగ మనోవేగాలతో మంత్రా లోపలికి, సగం బయటికి చదువుతూ లాగేస్తుంటాడు.

కాని వివాహంలో జరిగే ప్రతి పనికి ఒక ప్రత్యేకత గాని, అక్కడ చెప్పే మంత్రాలు వధూవరులిద్దఱు పెద్ద తీసుకుంటున్న నిర్ణయాలనిగాని- వాటికి ఎంతో లోతైన అర్థం ఉ మానవజీవితంలో వివాహమనే సంస్కారానికి ఎంతో ( ఉందనిగాని అనుకొనేవాళ్ళు, తెలియచెప్పేవాళ్ళుకూడా ఎవ్వరూ అంతా యాంత్రికంగా జరిగిపోతుంది. ఇది మన దౌర్భాగ్యం. 

అందుకే వివాహానికి సంబంధించిన సమగ్రస్వరూపం వధు తెలిస్తే ఆ సమయంలో తీసుకొంటున్న నిర్ణయాలు, చేసుకొనే వారికి అర్థమైతే, వారి జీవితాల్లో వేసే ప్రతి అడుగు :

వేస్తారనే ఆశయంతో వివాహ విజ్ఞానాన్ని ఇక్కడ అందఱికి అర్థమయ్యే రీతిలో పొందుపరుస్తున్నాను.

**2. గోదానవ్రతం:**

గురుకులంలో బ్రహ్మచర్యదీక్షతో విద్యాభ్యాసం పూర్తి చేసిన బ్రహ్మచారి ఆ దీక్షను విరమిస్తూ, అంతవఱకు పెంచిన గడ్డాలను, మీసాలను తీసివేయడమే గోదానవ్రతం. గోదానమంటే ఆవులను దానం చేయడం కాదు. కేశఖండనమన్నమాట, పుట్టువెంట్రుకలను తల్లిదండ్రులు తీయిస్తారు. కాని ఈ కేశఖండనం గురువు చేయిస్తాడు. సప్తసింధువులు ఇతని ఆయుష్యాన్ని హరించకుండా ఇంకా ఇంకా పెంచాలని ఈ సందర్భంలో గురువు ఆశీర్వదిస్తాడు.

సరైన సమయంలో తలపని చేయించుకుంటే ఆరోగ్యం, ఆయుష్యం పెరుగుతాయి. అలా కాకపోతే ఆరోగ్యం దెబ్బతిని ఆయుష్యం తరిగి పోతుందని మన శాస్త్రాలు చెబుతున్నాయి. అందుకే తలపనికి "ఆయుష్కర్మ" అనికూడా పేరేర్పడింది.

**3. స్నాతకం:**

గురుకులంలో బ్రహ్మచర్యాశ్రమాన్ని నిర్వహిస్తూ కష్టపడి దీక్షతో విద్యల నన్నింటిని అభ్యసించి, గృహస్థాశ్రమంలో ప్రవేశించమని గురువు ఆదేశించిన తరువాత స్నాతకవ్రతం చేయాలి. అన్ని దీక్షలను వదిలేసి క్షురకర్మ (తలపని) చేయించుకొని వేడినీళ్లతో స్నానం చేసిన వాడు స్నాతుడవుతాడు. అది ఈ వ్రతంలో ముఖ్యక్రియ కాబట్టి దీనికి స్నాతకమని పేరు. దీన్నే ఈనాడు విశ్వవిద్యాలయాల్లో స్నాతకోత్సవమనే పేరుతో (convocation) నామమాత్రంగా జరుపుతున్నారు.

తైత్తిరీయోపనిషత్తు స్నాతకునికి గురువు చేయవలసిన ఉపదేశాన్ని ఇలా పేర్కొంటున్నది....

**వేదమనూచ్య ఆచార్యోఽన్తేవాసినమనుశాస్తి.**
**సత్యం వద. ధర్మం చర. స్వాధ్యాయాన్మా ప్రమదః.**

వేదాధ్యయనం పూర్తిచేయించి గురువు శిష్యుణ్ణి ఇలా శాసిస్తున్నాడు. సత్యం మాట్లాడు! ధర్మాన్ని ఆచరించు; నేను నేర్పిన విద్యను తిరిగి అధ్యయనం చేయడంలో అశ్రద్ధ చేయకు!

**ఆచార్యాయ ప్రియం ధనమాహృత్య ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః సత్యాన్న ప్రమదితవ్యమ్. ధర్మాన్న ప్రమదితవ్యమ్. కుశలాన్న ప్రమదితవ్యమ్. భూత్యైన ప్రమదితవ్యమ్. స్వాధ్యాయప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్. దేవపితృకార్యాభ్యాం న ప్రమదితవ్యమ్.**

ఆచార్యునకు ఇష్టమైన గురుదక్షిణను సమర్పించి నీవఱకు వచ్చిన మానవసంతతి అనే దారాన్ని తెంపివేయకు! అంటే గృహస్థాశ్రమాన్ని స్వీకరించి యోగ్యమైన సంతానాన్ని పొందు! అలాగే నీవు సంపాదించిన విజ్ఞానాన్ని ఉపదేశించి విద్యాసంతతిని గూడా పెంపొందించు! అయితే ఈ గృహస్థాశ్రమ నిర్వహణ చాలా కష్టమైంది ఎన్నోభ్రమలు, పొరపాట్లు రావడానికి అవకాశం ఉంది. కనుక నైపుణ్యాన్ని ప్రదర్శించడంలో పొరపడకు! అభ్యుదయ సాధనలో పొరపడకు! వేదాన్ని అధ్యయనం చేయడంలోను, లేక జ్ఞానాన్ని సంపాదించడంలోను, ఇతరులకు వేదాన్ని నేర్పడంలోను, లేక ఇతరులకు జ్ఞానాన్ని ఉపదేశించడంలోను ఏమరపాటు పడకు!

**మాతృదేవో భవ. పితృదేవో భవ. ఆచార్యదేవో భవ. అతిథిదేవో భవ.**

తల్లిని దైవంగా అర్చించు! తండ్రిని దైవంగా ఆరాధించు! గురువును దైవంగా గౌరవించు! అతిథిని దైవంగా ఆదరించు!

**యాన్యనవద్యాని కర్మాణి. తాని సేవితవ్యాని. నో ఇతరాణి. యాని అస్మాకం సుచరితాని తాని త్వయా ఉపాస్యాని. నో ఇతరాణి.**

మంచిపనులని మహనీయులు చెప్పినవాటినే ఆచరించు! చెడ్డ పనులజోలికి పోవద్దు. మేమాచరిస్తున్న మంచిపనులనే నీవు కూడా ఆచరణలో పెట్టు. ఇతరమైన వాటి జోలికి పోవద్దు.

**ఏకే చాస్మచ్ఛ్రేయాంసో బ్రాహ్మణాః. తేషాం త్వయా ఆసనే న ప్రశ్వసితవ్యమ్. శ్రద్ధయా దేయమ్. అశ్రద్ధయాఽదేయమ్. శ్రియా దేయమ్. హ్రియా దేయమ్. భియా దేయమ్. సంవిదా దేయమ్.**

మనకు శ్రేయోభిలాషులు బ్రహ్మజ్ఞానంతో ప్రకాశించే బ్రాహ్మణులు దయచేస్తే వాళ్లను ఆహ్వానించి, అతిథ్యం ఇచ్చి ఆదరించు! ఏదైనా ఎవరికైనా ఇచ్చేటప్పుడు శ్రద్ధతోఇవ్వు! అశ్రద్ధతో ఇవ్వద్దు! నీ సిరిసంపదలకు తగినట్లు దానం చెయ్యి! "అయ్యో! ఇంతే ఇవ్వగలుగుతున్నానే" అని సిగ్గుపడుతూ ఇవ్వు! భయపడుతూ ఇవ్వు! తీసికొనే వ్యక్తిలో భగవంతుణ్ణి చూస్తూ ఇవ్వు!

**అథయది తే కర్మవిచికిత్సా వా వృత్తవిచికిత్సా వా స్యాత్, యే తత్ర బ్రాహ్మణాః సంమర్శినః. యుక్తాః ఆయుక్తాః. అలూక్షా ధర్మకామాః స్యుః. యథా తే వర్తేరన్. తథా తత్ర వర్తేథాః.**

నీవు చేసే సత్కార్యాల్లోగాని, నీ నడవడిని గురించిగాని సందేహాలు కలిగినప్పుడు, నీతోపాటు ధార్మికజీవితాన్ని గడుపుతూ సమభావన కలిగి భగవద్భక్తితో ధర్మబద్ధమైన కోరికలతో ఏ లోపంలేకుండా చక్కని వివేకంతో ప్రతివిషయాన్నీ విమర్శించి ఒక నిర్ణయానికి రాగల బ్రహ్మజ్ఞులైన పెద్దలు, ఆ పరిస్థితుల్లో ఎలా ప్రవర్తించారో తెలుసుకొని నీవుకూడా అలాగే ప్రవర్తించు!

**అథాభ్యాఖ్యాతేషు. యే తత్ర బ్రాహ్మణాః సంమర్శినః. యుక్తా ఆయుక్తాః. అలూక్షా ధర్మకామాః స్యుః. యథా తే తేషు వర్తేరన్. తథా తేషు వర్తేథాః. ఏష ఆదేశః. ఏష ఉపదేశః. ఏషా వేదోపనిషత్. ఏ తదను శాసనమ్. ఏవముపాసితవ్యమ్. ఏవము చైతదుపాస్యమ్.**

ఇక ఇతరులలో తప్పులు కనపడినప్పుడు, వాళ్ళను నిందించాల్సి వచ్చినప్పుడుకూడా, సమభావనతో దైవభక్తితో ధార్మికమైన అభిలాషలతో ఏ లోపం లేకుండా ప్రతి విషయాన్ని విచక్షణా జ్ఞానంతో విమర్శించి నిర్ణయించగల బ్రహ్మజ్ఞానులైన బ్రాహ్మణులు ఆ సందర్భంలో ఎలా నడచుకొన్నారో తెలిసికొని నీవుకూడా అలా ప్రవర్తించు! ఇదే మా

ఆదేశం. ఇదే మా ఉపదేశం. ఇదే వేదసార భూతమైన ఉపనిషత్. ఇదే మా అనుశాసనం. ఇలాగే సాధన చెయ్. ఇలాగే సంస్కారాన్ని పెంచుకుంటూ మళ్లా మళ్లా సాధన చెయ్.

ఆహా! ఎంత చక్కటి చిక్కటి ఉపదేశం. ప్రాచీన భారతదేశంలో బ్రహ్మచర్యాన్ని చక్కగా పూర్తిచేసి విద్యలను సంపాదించి పెండ్లి చేసికొని గృహస్థుగా మారి ఈ సమాజసేవకు అంకితమయ్యే అంతేవాసికి గురువు చేసే ఉపదేశ మిది. అతడి బ్రతుకుకు ఆచార్యుడు వేసే బంగారుబాట ఇది. విద్యాబుద్ధులతో నీతి నియమాలతో, భక్తి విశ్వాసాలతో, సేవా సంస్కారాలతో తన శిష్యుణ్ణి తీర్చి దిద్ది ఈ సమాజానికి అంకితం చేస్తున్నాడు గురువు స్నాతకోత్సవంలో. ఒక్కసారి ఆలోచించండి..భారతీయ సంస్కృతి ఎంత ఉదాత్తమైన విలువలతో నిండి ఉన్నదో.

స్నాతక శుభసమయంలో ఆచార్యుడందించిన ఆదేశంలో.."ఇంత వఱకు నీ వంశస్థులు మంచి సంతానాన్ని ఈ సమాజ సేవకోసం పరంపరగా అందిస్తూ వచ్చారు. భావి జీవితాన్ని భాసురంగా తీర్చి దిద్దుకొని ఇతరులకు సేవ చేసే విజ్ఞానాన్ని సంపాదించావు. కాబట్టి నీ వఱకు వచ్చిన ఈ సంతానలతను తెంచివేయకుండా నీ పితరుల ఋణాన్ని తీర్చుకోవడానికి మంచి సంతానాన్ని పొందాలి. అందుకోసమే గృహస్థాశ్రమాన్ని స్వీకరించు!" అనే మాటలకు కట్టుబడి, ఆయన అనుమతిని తీసుకొంటాడు స్నాతకుడు. ఆ తరువాత గురుదక్షిణతోబాటు ఆవు, దూడ ఎద్దు మొదలైన వాటిని ఆయనకు సమర్పించి, అప్పటినుంచి ఒక సంవత్సరం వ్రతదీక్షతో ఉంటాడు.

### 4. సమావర్తనం:

సమావర్తన మంటే తిరిగిరావడం. విద్యాభ్యాసం పూర్తిచేసి స్నాతకవ్రతం చేపట్టిన ఒక సంవత్సరానికి స్నాతకుడు గురుకులాన్నుంచి పాదయాత్రతో లౌకిక ప్రపంచంలోకి తిరిగిరావడాన్నే సమావర్తన మంటారు. ఈ సందర్భంలో స్నాతకుడు **1.** మణికుండలాలు

**2.**పంచెలచాపు **3.** గొడుగు **4.** చెప్పులు **5.** చేతికర్ర **6.** పూలదండ **7.**నలుగుపిండి **8.** తలనూనె **9.** కాటుక **10.** తలపాగాలను గురువుకు సమర్పించి, తానుకూడా తీసికొంటాడు. తరువాత బ్రహ్మచర్యాశ్రమంలోని కర్తవ్య లోపాలకు తగిన ప్రాయశ్చిత్తం చేస్తాడు. ఆ పైన ఆయుష్యాన్ని, తేజస్సును, ధనాన్ని పుష్టిని పెంచే బంగారు ఆభరణాలను ధరించి ఈశాన్యదిశగా కాశీయాత్రకు బయలుదేరతాడు.

**5. కాశీయాత్ర:**

కాశీయాత్రకు బయలుదేరిన స్నాతకుణ్ణి కన్యాదాతగాని లేక కన్యా సోదరుడు గాని "సర్వాలంకారభూషితయైన మా కన్యను మీ కిచ్చి వివాహం చేస్తాం. అగ్నిసాక్షిగా పాణిగ్రహణం చేయండి. దయతో మాఇంటికి రండి" అని ఆహ్వానిస్తాడు. అందుకు అంగీకరించి వరుడు ఇంటికి బయలుదేరుతాడు.

**6. యజ్ఞోపవీతం:**

ఉపనయన కాలంలో ధరించిన యజ్ఞోపవీతం కాక స్నాతకవ్రతానికి అంగమైన రెండో యజ్ఞోపవీతాన్ని వరుడు ఈ సందర్భంలో ధరిస్తాడు. బ్రహ్మచారి ఒక యజ్ఞోపవీతాన్ని గృహస్థు రెండు యజ్ఞోపవీతాలను (పోగులను) ధరించడం సంప్రదాయం. ఆ పైన గృహస్థాశ్రమ నియమాలను ఉల్లంఘించనని వరుడు ప్రమాణం చేస్తాడు.

**7. కన్యావరణం:**

కన్యావరణమంటే మంచి లక్షణాలుగల కన్యను నిర్ణయించుకోవడం. ఇద్దఱు లేక నల్గురు లేక ఎనిమిదిమంది యోగ్యులు గృహస్థులైన మిత్రులను వరుడు తనకోసం మంచి కన్యను విచారించి నిర్ణయించమని కోరతాడు. అతని కోరిక ననుసరించి వాళ్లు వెళ్లి విచారించి తగిన కన్యను నిశ్చయిస్తారు.

---

7. కన్యను వరించడానికి మృగశిరా నక్షత్రంలో పెద్దలను పంపితే కన్యాదాత గౌరవానికి వాళ్లు పాత్రులౌతారు. కార్యసిద్ధి కలుగుతుందని ఆపస్తంబ గృహ్య సూత్రం చెబుతోంది దీన్ని ఈనాడు వరాన్వేషణకుకూడా అన్వయించుకోవచ్చు.

**8.** వరాగమనం:

సుముహూర్తం నిశ్చయమైన తరువాత తగినంత ముందుగా వరుడు బంధుమిత్రులతో కలసి మంగళగీత వాద్యాలతో శుభశకునాలతో కన్యాదాత యిచ్చిన విడిది ఇంటికి తరలి వెళ్ళడమే వరాగమనమంటారు. అతని వెంట పెద్దలు, బ్రాహ్మణులు, ముత్తైదువులు, బంధువులు, మిత్రులుకూడా బయలుదేరి వెడతారు.

**9.** వరపూజ:

పెండ్లి కుమారుడు అతని తరపు పెద్దలు పెండ్లికి తరలి వచ్చిన తరువాత, కన్యాదాత సకుంటుంబ పరివారంగా సకల మంగళవాద్య ఘోషలతో సమస్త సుగంధ పూజా ద్రవ్య ఫల పుష్పమాలానులేపనాదులతో వారి దగ్గఱకు వెళ్లి వరపూజ చేస్తాడు. శ్రీ లక్ష్మీనారాయణ స్వరూపుడైన వరునికి ఈ క్రింది మంత్రంతో పాద ప్రక్షాళనం చేస్తాడు..

**నమోఽ స్త్వనన్తాయ సహస్రమూర్తయే**
**సహస్ర పాదాక్షి శిరోరుబాహవే।**
**సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే**
**సహస్రకోటీయుగధారిణే నమః॥**

వేలకొలది రూపాలు, పాదాలు, కన్నులు, తలలు, తొడలు, బాహువులు, నామాలు, కిరీటాలు ధరించిన, అనంతుడైన శాశ్వతుడైన పురుషోత్తమునకు నమస్కారం చేస్తున్నాను.

ఆపైన వరునికి బంధువులకు నూతన వస్త్రాభరణాదులను, సుగంధమాల్యాలను లేపనాలను సమర్పించి కాలానుగుణమైన ఉపహార పానీయాలను (పానకం వగైరా) ఇచ్చి గౌరవించి వారినందఱిని కల్యాణ వేదిక దగ్గఱికి విచ్చేయమని ఆహ్వానిస్తాడు కన్యాదాత.

**10.** గోత్రప్రవరలు:

గోత్రమంటే వంశం. ప్రవర అంటే వంశమూలపురుషుల కూటం. వరుడు కన్యాన్వేషణ చేయమని అడిగిన తరువాత కొందఱు పెద్దలు

వెళ్లి కన్యాదాతకు వరుని వంశాన్ని గురించి వివరించి చెప్పడాన్నే ఇక్కడ గోత్రప్రవరలు చెప్పడం అంటున్నాం. అంటే వరుని ముత్తాత, తాత, తండ్రి ఎవరెవరో కన్యాదాతకు తెలియజేసి, కన్య ముత్తాత, తాత, తండ్రి ఎవరెవరో తెలిసికొని "మీ కన్యను మా కుఱ్ఱవాడికి ధర్మసంతాన సంపద కోసం ఇవ్వండి" అని అడగటమే ఇక్కడ ప్రధానాంశం. ఆడపిల్లలు తక్కువగా ఉండే రోజుల్లో ఆడపిల్ల పుట్టటంతోటే సంబంధాలు కలుపుకోవాలనే ఆలోచన లుండేవి. అందువల్లనే పిల్లవాడి తరపువాళ్లు వెళ్లి "పిల్లనివ్వండి" అని అడగవలసి వచ్చేది. ఇప్పుడు పరిస్థితులు పూర్తిగా తారుమారైనాయి. "మీ కేం కావాలన్నా ఇస్తాం, మాపిల్లను చేసుకుంటారా? బాబూ" అని సాధారణంగా కన్యాదాత బ్రతిమలాడే రోజుల్లో మనం ఉన్నాం.

వరుని తరపువాళ్లు మూడుసార్లు ఇలా అడిగిన తరువాత కన్యాదాత "అలాగే ఇస్తాను" అని మూడుసార్లు తన అంగీకారాన్ని తెలియజేస్తాడు. మధ్యవర్తులైన పెద్దలు వచ్చి తమ నిర్ణయాన్ని వరుడికి తెలియజేస్తారు. ఈనాడు సంబంధనిశ్చయానికి ముందువఱకు జరిగే సంప్రతింపుల కార్యక్రమమే ఇది. కాని ఇప్పుడు పెళ్లిలోనే దీన్ని జరుపుతున్నారు.

**11. మహాసంకల్పం:**

మామూలుగా ప్రతిపని చేసేటప్పుడు'కరిష్యే'(చేస్తాను)అని అనడాన్ని సంకల్పం అంటారు. మానవజీవితంలో వివాహమనేది ఎంతో ముఖ్యమైన సంస్కారంకాబట్టి, పిల్లను ఇచ్చే వ్యక్తికి పదితరాలు వెనుక, పదితరాలు ముందు వఱకు కన్యాదానఫలాన్ని అనుభవిస్తారు కాబట్టి ఇక్కడ చేసే సంకల్పం చాలా విలక్షణమైందిగా చెప్పబడింది. అందుకే దీన్ని మహాసంకల్పం అన్నారు.

మహాసంకల్పం విశ్వస్వరూపాన్ని చక్కగా వర్ణిస్తున్నది ఇందులో భూగోళస్థితి వివరంగా చెప్పబడింది. భూమండలాన్ని పరిపాలించిన షోడశమహారాజులు, షట్చక్రవర్తులు, అలాగే అనేకదేశాలు, పుణ్యనదులు, పుణ్యక్షేత్రాలు, పుణ్యతీర్థాలు, సప్తద్వీపాలు, నవవర్షాలు, నవఖండాలు,

దశారణ్యాలు, ఏభైకోట్లయోజనాల విస్తీర్ణం గల భూమండలం, అందులో లక్షయోజనాల విస్తీర్ణంగల జంబూద్వీపం, అందులోని భరతవర్షం, భరతఖండంలో ఈ కన్యాదానం ఎక్కడ చేస్తున్నది కన్యాదాత పేర్కొంటాడు.

అలాగే బ్రహ్మకాలమాన ప్రకారం యాభైసంవత్సరాలు పూర్వార్ధం గడవగా, ఏభై ఒకటవ సంవత్సరంలో మొదటిమాసంలో మొదటి పక్షంలో మొదటి పగట్లో బ్రహ్మకు ప్రాణాయామకాలం ప్రస్తుతం జరుగుతున్నట్లు చెప్పి, తొమ్మిది కల్పాలలో శ్వేతవరాహకల్పంలో, పధ్నాలుగుమన్వంతరాలలో ఏడవదైన వైవస్వతమన్వంతరలో శాలివాహనశకంలో ఇరవై ఎనిమిదవ మహాయుగంలో ఫలాన సంవత్సరంలో.......... మాసంలో....... తిథిలో ఈ సుముహూర్తంలో శ్రీ లక్ష్మీనారాయణ ప్రీతి కోసం సర్వాలంకారభూషితయైన ఈ కన్యను దానం చేస్తున్నాను.

ఈ కన్యాదానంవల్ల నాకు బ్రహ్మలోకంలో నివసించే యోగ్యత సిద్ధించాలి. అగ్నిహోత్ర, వాజపేయాది శతక్రతుపుణ్యఫలం లభించాలి. నాకు వెనుక ముందు పది తరాల వాళ్ళు బ్రహ్మలోకంలో నివసించాలి అని కన్యాదాత సంకల్పం చేస్తాడు.

వివాహ సమయంలో చేసే మహాసంకల్పం మహాకాలంలో, మహావిశ్వంలో మానవుడెంత చిన్నవాడో అర్థం చేసుకోవడానికి అహంకారాన్ని తగ్గించుకొని, వినయవిధేయతలను పెంచుకొని, కర్తవ్యపరాయణుడై ధర్మానికి కట్టుబడి ఉండటానికి ఎంతో ఉపయోగపడుతున్నది.

**12. మంగళాష్టకాలు:**

ఈ నూతన వధూవరులకు మంగళం కలగాలని చదివే ఎనిమిది శ్లోకాలకు మంగళాష్టకాలని పేరు. ఇందులో లక్ష్మీనారాయణులు, పార్వతీపరమేశ్వరులు, వాణీపద్మభవులు, కొత్తగా వివాహంచేసుకున్న ఈ దంపతులకు ఆయురారోగ్య భోగభాగ్యాలను ఇచ్చి కాపాడాలనే శుభాకాంక్ష కనపడుతుంది.

ప్రత్యేకంగా సీతారాములుగాని, రుక్మిణీకృష్ణులుగాని, లేక దశావతారమూర్తులుగాని ఈ వధూవరులను అనుగ్రహించాలని కోరే మంగళశ్లోకాలు కూడా ఈ సందర్భంలో చదవడం సంప్రదాయం.

**13. కాళ్లుకడగడం:**

లోకంలో చిన్నవాళ్లు పెద్దవాళ్లకు కాళ్లు కడిగి పూజచేయటం పరిపాటి. కాని ఇక్కడ వయసులో పెద్దవాళ్లైన కన్యాదాత, అతని భార్య అల్లునికాళ్లు కడిగి పూజించి కన్యాదానం చేస్తారు. ఏమిటి విశేషం? ఇందులో కన్యాదానం చేస్తున్నది శ్రీ లక్ష్మీనారాయణ ప్రీతికోసం. పెండ్లికొడుకును సాక్షాత్ శ్రీ లక్ష్మీనారాయణ స్వరూపిగా భావించమని సంప్రదాయం చెబుతుంది. కాబట్టి చిన్నవాడైనా అతనిలోగల శ్రీ లక్ష్మీనారాయణునికే కాళ్లు కడగడం, పూజ చేయడం అని తెలుసుకోవాలి. అంటే భగవన్మయంగా ఈ ప్రపంచాన్ని భావించాలన్నమాట.

మన పెద్దవాళ్ళు ఏ పని చేసినా, దేన్ని రూపొందించినా అందులో ఏదో ఒక తాత్త్వికభావన అంతర్లీనంగా ఉంటూనే ఉంటుంది. భారతీయ జీవనవిధానంలో ఆ దృష్టి ఉండటంవల్లనే భారతీయ సంస్కృతి ప్రపంచంలోని సభ్యదేశాలన్నింటిలోను అద్వితీయంగా కొనియాడబడుతున్నది.

పెండ్లికొడుకు కాళ్లు కడిగినప్పుడు ముందు కుడికాలును తరువాత ఎడమకాలును ఇంద్రుని అంశగా భావించి కడగాలి. తరువాత రెండు పాదాలను కలిపి కడగాలి.

**14. కన్యాదానం:**

అన్ని దానాల్లోకి కన్యాదానం చాలా గొప్ప దానం. ఇది మహాదానాల్లో చేరుతుంది. పిల్లతండ్రి కన్యాదానం చేయబోయే ముందు ఇలా అంటాడు...

**కన్యాం కనకసంపన్నాం కనకాభరణైర్యుతామ్।**
**దాస్యామి విష్ణవే తుభ్యం బ్రహ్మలోకజిగీషయా॥**

బ్రహ్మలోకప్రాప్తికోసం నేను సువర్ణసంపదగలది, స్వర్ణాభరణ భూషిత అయిన ఈ కన్యను లక్ష్మీనారాయణ స్వరూపుడవైన నీకు దానంచేయబోతున్నాను.

**కన్యే మమాగ్రతో భూయాః కన్యే మే దేవి పార్శ్వయోః।**
**కన్యే మే సర్వతో భూయాస్త్వద్దానాన్మోక్షమాప్నుయామ్॥**

ఓ కన్యా! నా ముందు నిలబడు! నాకు రెండువైపులా ఉండు! నిన్ను దానంచేసి ఆ పుణ్యవిశేషంవల్ల మోక్షాన్ని పొందుతాను.

**విశ్వంభర స్సర్వభూతా స్సాక్షిణ్యః సర్వదేవతాః।**
**కన్యా మిమాం ప్రదాస్యామి పితౄణాం తారణాయ వై॥**

భగవంతుడు, పంచభూతాలు, సకలదేవతలు సాక్షులుగా నా పితృదేవతలు తరించడానికి ఈ కన్యను దానం చేయబోతున్నాను.

**కన్యాం సాలంకృతాం సాధ్వీం సుశీలాయ సుధీమతే।**
**ప్రయతోఽహం ప్రయచ్ఛామి ధర్మకామార్థసిద్ధయే॥**

సర్వాలంకారశోభిత, సాధ్వి, సుశీల అయిన ఈ అమ్మాయిని ధర్మార్థకామాలనే పురుషార్థాలు సిద్ధించడానికి నియమపూర్వకంగా ఈ బుద్ధిమంతునికి దానం చేస్తున్నాను.

ఇదివఱకటిలాగానే వధూగోత్రప్రవరలను, వరగోత్రప్రవరలను చెప్పి వరుని చేతిలో జలధారను పోస్తూ "నీతో కలసి మెలసి అర్ధాంగిగా ఉండి సంతానాన్ని కని నీ వంశాన్ని వృద్ధిపొందించడానికి "ఈ కన్యను నీకు దానం చేస్తున్నానని చెప్పి పిల్ల తల్లితండ్రులు కన్యాదానం చేస్తారు. పెండ్లికొడుకు సంతోషంగా ఆమెను పరిగ్రహించి `మంచిది' అంటాడు. దానం సఫలం కావడం కోసం దక్షిణ సమర్పించబడుతుంది. అటు తరువాత శాలగ్రావాన్ని (సాలగ్రావం) కూడా దానం చేస్తారు. కన్యాదాత వరునితో ఇలా అంటాడు..."బాబూ! నీకు ఈమె అర్ధాంగి. ధర్మమైనా, అర్థమైనా, కామమైనా మీ రిద్దఱు కలసి సంపాదించాలి. ఈమెను అతిక్రమించి వెళ్లకు". వరుడు"అతిక్రమించను" అని వాళ్లకు మాట ఇస్తాడు.

**15. మధుపర్కం:**

పెరుగు తేనె సమంగా కలిపి కంచుపాత్రలో పోసి దానిపై కంచుమూత పెట్టి దారాలతో గట్టిగా బంధిస్తారు. దీన్నే మధుపర్కం అంటారు. కొందఱు దీనిలో నెయ్యి కలపాలని, ఇంకొందఱు దీనిలో అటుకులు కూడా కలపాలని చెబుతారు. ఈ మధుపర్కం ప్రధానంగా చేసే పూజ కాబట్టి దీనికి మధుపర్క పూజ అని పేరొచ్చింది.

కన్యాదానకాలంలో వరునికి మధుపర్కం ఇస్తాడు. ఇది గొప్ప గౌరవమన్నమాట. పిల్ల తండ్రి వరుని కాళ్ళు కడిగి, అర్ఘ్యం ఇచ్చి మధుపర్కం ఇస్తాడు. వరుడు మధుపర్కాన్ని తీసికొంటాడు. పిల్లతండ్రి తరువాత అందఱికి భోజనం పెట్టి వరునికి వస్త్రాభరణాదుల నిస్తాడు.

**16. సమీక్షణం:**

వరుడు వధువుముఖాన్ని సుమూహూర్తకాలంలో చూడటాన్నే సమీక్షణం లేక నిరీక్షణం అంటారు.

కల్యాణవేదికపైన వధువు తూర్పుముఖంగా కూర్చుంటుంది. వరుడు పశ్చిమ ముఖంగా కూర్చుంటాడు. వీరిద్దఱి మధ్య అడ్డుగా తెల్లటి తెరశెల్లాను పట్టుకుంటారు. వధూవరుల చేతిలో జీలకఱ్ఱ బెల్లం మెత్తటి పొడిగా నలిపి ఉండజేసి సిద్ధంగా ఉంచుతారు. సకలమంగళ వాద్యాలు మోగుతుంటాయి. వేదఘోష జరుగుతుండగా ముత్తయిదువులు మంగళగీతిక లాలపిస్తుండగా శుభమువార్తకాలంలో తెరను తొలగిస్తారు. వరుడు తన ఇష్టదేవతా ధ్యానం చేసుకొని వధువు కనుబొమ్మల మధ్యభాగాన్ని చూస్తాడు. జీలకఱ్ఱ బెల్లాన్ని ఆమె నడినెత్తిన బ్రహ్మ రంధ్రంపైన ఉంచుతాడు. అలాగే వధువుకూడా తన ఇష్ట దేవతా ధ్యానంతో పెండ్లికొడుకు కనుబొమ్మల మధ్యను చూసి అతని నడి నెత్తిన జీలకఱ్ఱ బెల్లం ముద్దను ఉంచుతుంది. తరువాత పెండ్లి కొడుకు ఈ మంత్రాన్ని చెబుతాడు.

**అభ్రాతృఘ్నీం వరుణ అపతిఘ్నీం బృహస్పతే ।**
**ఇంద్రాపుత్రఘ్నీం లక్ష్మీం తామస్యై సవిత స్సువ ॥**

ఓ వరుణదేవా! సవితవల్ల ఈమెకు కలిగిన లక్ష్మి సోదరులకు అభివృద్ధిని కలిగించాలి. బృహస్పతీ! నీ దయవల్ల ఈమె భర్తకు అభివృద్ధిని కలిగించేది కావాలి. ఇంద్రా! ఈమె పుత్రసంతానం పొందేదిగా అనుగ్రహించు!

**అఘోరచక్షు రపతిఘ్నేధి శివాపతిభ్యః సుమనాః సువర్చాః।**

శుభదృష్టితో, సౌమాంగల్యంతో సౌభాగ్యవతిగా వృద్ధిపొందు! మన పశుసంపద అభివృద్ధి చెందేటట్లు మంచి మనస్సుతో ఉండు!

**జీవసూః దేవకామా స్యోనా శన్నో భవద్విపదే శం చతుష్పదే॥**

నీవు మంచి పుత్రులను పొందాలి. దేవతలు మెచ్చేటట్లుండాలి నీ ప్రవర్తన. మనకు మన బంధువులకు, అందఱికి శాంతి కలగాలి.

తరువాత వధువు కనుబొమ్మల మధ్య దర్భల చివళ్లతో వరుడు మూడుసార్లు తుడుస్తూ నీలోగల అవలక్షణాలన్నీ పోవాలని నిర్దేశిస్తున్నానంటాడు.

తరువాత, కాడిని ఉత్తర దక్షిణాలుగా పెండ్లికూతురు నెత్తిపైన నిలబెట్టి, దక్షిణభాగంలోని చిల్లినుంచి జలాన్ని ప్రోక్షిస్తూ "ఇంద్రుని దయవల్ల ఈ వధువు సూర్యుని తేజస్సుతో ప్రకాశించాలి" అంటాడు వరుడు. ఆపైన కాడిచిల్లినుంచి వచ్చిన జలంతో వధువు స్నానం చేస్తుంది. కొత్త బట్టలను కట్టుకొని వచ్చికూర్చుంటుంది.

జీలకఱ్ఱ-బెల్లం ఈ రెండింటి సంయోగంవల్ల ఒక కొత్తశక్తి పుడుతుంది. నడినెత్తిన బ్రహ్మరంధ్రంపైన ఆ ముద్దను పెట్టిన తరువాత వధూవరుల కిద్దఱకు ఒకరిపై ఇంకొకఱికి స్థిరమైన దృష్టి కేంద్రీకరణ జరుగుతుందని పెద్దలు చెబుతున్నారు. వైజ్ఞానికులు కూడ ఈ విషయాన్ని అంగీకరించారు. శుభక్షణాల్లో కలసిన అనురాగమయమైన ఆ ప్రథమదృష్టివారి మధ్య మానసికబంధాన్ని క్షణక్షణానికి పెంచుతుంది.

**17. యోక్త్రధారణం:**

యోక్త్రమంటే దర్భత్రాడు. వరుడు ఈ త్రాడును వధువు నడుముకు

చుట్టి ముడివేస్తాడు. ఈ కర్మను పత్నీవ్రతోపనయనం అంటారు. దంపతులిద్దఱు కలసి ఈ జీవితయజ్ఞాన్ని నిర్వహించడానికి భర్త దీని ద్వారా భార్యకు అధికారాన్ని ఇస్తున్నాడు. ఈ సందర్భంలో వరుడు ఈ మంత్రాన్ని చెబుతాడు.

**ఆశాసానా సౌమనసం ప్రజాం సౌభాగ్యం తనూమ్।**
**అగ్నేరనువ్రతా భూత్వా సన్నహ్యే సుకృతాయ కమ్॥**

మంచి మనస్సు, యోగ్యమైన సంతానం చక్కని సౌభాగ్యం శుద్ధమైన శరీరం తనకు ఏర్పడాలని ఈ వధువు అగ్నిహోత్రుణ్ణి ఆరాధిస్తున్నది. ఈ జీవితయజ్ఞమనే శుభకార్యం కోసం ఈమె నడుముకు దర్భత్రాడు కడుతున్నాను.

**18. మంగళసూత్రం:**

సకల మంగళాలకు ఆలవాలమైన సూత్రం మంగళసూత్రం. బంగారుతో వాళ్ళ వంశాచారానికి తగినట్లు తయారు చేసిన మాంగళ్యాలను పసుపు త్రాటిలో వేసి వాటిలో మంగళదేవత, లక్ష్మీదేవిని ఆవాహనచేసి పూజిస్తాడు వరుడు. కళ్యాణవేదికపైనున్న బ్రాహ్మణులు, పెద్దలు, ముత్తయిదువలు దాన్ని మంచిహృదయంతో ముట్టుకుంటారు. వధువు మెడలో ఆ సూత్రాన్ని రెండుముళ్లు గట్టిగా, ఒక ముడి వదులుగా మొత్తం మూడు ముళ్లు వేస్తాడు వరుడు. అప్పుడీ మంత్రాన్ని చెబుతాడు..

**మాంగల్యం తంతునానేన మమ జీవన హేతునా।**
**కంఠే బధ్నామి సుభగే!త్వం జీవ శరదాం శతమ్॥**

నా సుఖజీవనానికి హేతువులైన ఈ సూత్రంతో మాంగల్యాన్ని నీ మెడలో కడుతున్నాను. నీవు నూరేళ్ళు వర్ధిల్లు!

వివాహిత అయిన భారతీయ స్త్రీకి మంగళసూత్రం ప్రాణాలకంటే ముఖ్యమైంది. పరమపవిత్రమైన పరిణయబంధానికి చిహ్నం ఈ సూత్రం.

## 19. తలంబ్రాలు:

వధూవరులు ఒకరి తలపై మఱొకరు పసుపులో తడిసిన అక్షతలను దోసిళ్లతో పోసుకోవడాన్ని తలంబ్రాలు పోసుకోవడం అంటారు. దీన్నే అక్షతారోపణమని పిలుస్తారు. ఇది చూడటానికి చాలా వేడుకగా కనపడుతుంది. పెండ్లికి వచ్చిన బంధుమిత్రులంతా వివాహంలో ఏ ఘట్టాన్ని చూసినా చూడకపోయినా దీన్ని మాత్రం చూడకుండా ఉండరు. తెలుగుదేశంలో ఈ సందర్భంలో ప్రత్యేకమైన సన్నాయి వాద్యం కూడా వినబడుతుంది.

వీటన్నింటితో పాటు ఇక్కడ జరిగే క్రియాక్రమంలో ఒక ప్రత్యేకత, చెప్పే మంత్రాలలో చాలా గొప్ప అర్థాలు ఇమిడి ఉండటం విశేషం. చూడండి...

వరుడు, వధువు దోసిట్లో ఎండు కొబ్బరి చిప్పతో రెండుసార్లు అక్షతలను పోసి, వాటిని రెండుసార్లు నేతితో ప్రోక్షిస్తాడు తరువాత పురోహితుడు వరుని దోసిట్లో అదేమాదిరి అక్షతలను పోసి నేతితో ప్రోక్షించి, పెండ్లికూతురు దోసిలిపైన ఇతని దోసిలి పెడతాడు. ఈ మంత్రాలను చదువుతాడు.. .

> **కపిలాగ్ం స్మారయన్తు. బహుదేయం చాస్తు. పుణ్యాం వర్ధతామ్. శాన్తిరస్తు. పుష్టిరస్తు. తుష్టిరస్తు. వృద్ధిరస్తు. అవిఘ్నమస్తు. ఆయుష్యమస్తు. ఆరోగ్యమస్తు. స్వస్తి శివం కర్మాస్తు. కర్మసమృద్ధిరస్తు. దంపత్యోః సగ్రహే సనక్షత్రే సహ సోమేన క్రియేతాం. శాంతి రస్తు.**

కర్రి ఆవులను స్మరించండి! అనేక దానాలను చేయండి! పుణ్యాం వృద్ధిపొందాలి. శాంతి, పుష్టి తుష్టి వృద్ధి కలగాలి. విఘ్నాలు తొలగిపోవాలి. ఆయుష్యం, ఆరోగ్యం కలగాలి. క్షేమం, మంగళం కలగాలి. సత్కర్మలు వృద్ధి పొందాలి. గ్రహాల వల్ల, నక్షత్రాల వల్ల సోముని వల్ల మన దాంపత్యం సరిగా జరగాలి. శాంతి కలగాలి.

ఈ క్రింది మంత్రాలను చెబుతూ వరుడు వధువు తలపైన మొదట తలంబ్రాలు పోయాలి...

**ప్రజాపతిః స్త్రియాం యశః ముష్కయోరదధాత్సపమ్।**
**కామస్య తృప్తి మానందం తస్యాగ్నే భాజయేహ మా॥**

ప్రజాపతి, భార్యలో కీర్తికారణమైన వీర్యాన్ని వృషణాలలో ఉంచాడు. దానివల్ల కలిగే కామ తృప్తిని, ఆనందాన్ని ఓ అగ్నీ! మా దాంపత్యంలో కలిగించు!

**మోదః ప్రమోద ఆనన్దః ముష్కయో ర్నిహిత స్సపః।**
**సృత్యేవ కామస్య తృప్యాణి దక్షిణానాం ప్రతిగ్రహే॥**

సంతోషం, పరవశత్వం, ఆనందం వీటి మూడింటిని కలిపి వృషణాలలో ఉంచాడు ప్రజాపతి. దక్షిణలను స్వీకరించినప్పుడు కన్యను పరిగ్రహించినంత తృప్తికలుగుతుంది.

**మనసశ్చిత్త మాకూతిం వాచ స్సత్య మశీమహి।**
**పశూనాం రూప మన్నస్య యశః శ్రీః శ్రయతాం మయి॥**

మనమిద్దఱం మనస్సుకు సంబంధించిన విజ్ఞానాన్ని, మంచి సంకల్పాన్ని, సత్యాన్ని పొందాలి. అలాగే పశుసంపద, అన్నసంపద వాటి ద్వారా వచ్చే కీర్తిని ప్రతిష్ఠను అనుభవించాలి.

**యథాహమస్యా అతృపం స్త్రియై పుమాన్ యథా స్త్రీ తృప్యతి।**
**పుంసిప్రియే ప్రియాఏవం భగస్య తృప్యాణి యజ్ఞస్య కామ్యః ప్రియః॥**

యజ్ఞానికి ఇష్టుడనైన నేను, ప్రియురాలు ప్రియునితో ఎలా తృప్తిని పొందుతుందో అలాగే నీలో తృప్తిని పొందుతాను.

**దదామిత్యగ్నిర్వదతి తథేతి వాయురాహ తత్।**
**హన్తేతి సత్యం చన్ద్రమాః ఆదిత్యస్సత్య మోమితి॥**

ఈ కన్యను నేను దానం చేస్తున్నానని అగ్ని చెబుతున్నాడు. అలాగేనని వాయుదేవుడన్నాడు.అది నిజమా! నాకూ ఇష్టమేనని చంద్రుడన్నాడు. సత్యమేనని ఆదిత్యు డంగీకరించాడు.

**అప స్తత్సత్య మాభరన్ యశో యజ్ఞస్య దక్షిణామ్**
**ప్రజామే కామ స్సమృధ్యతామ్.**

యజ్ఞదక్షిణారూపమైన, కీర్తికారణమైన ఈ కన్యను అబ్దేవతలు తీసికొని వచ్చారు. అందువల్ల నేను కోరిన సంతానం సమృద్ధిగా కలుగుగాక!

ఇలా వరుడు తలంబ్రాలు పోసిన తరువాత, వధువు వరునిపై తన దోసిలిలోని తలంబ్రాలను పోస్తుంది. రెండవసారి వెనుకటిలాగానే దోసిళ్లలో తలంబ్రాలు నింపుకొని వధువు దోసిలిపై భాగంలో పెట్టి, పై మంత్రాలను చదువుతూ చివఱలో మాత్రం ఈ క్రింది వాక్యం చెబుతూ వరునిపై తలంబ్రాలు పోస్తుంది..

**పశవో మే కామ స్సమృధ్యతామ్**

నా కిష్టమైన పశువులు, పాడిపంటలు సమృద్ధిగా ఉండాలి.

ఇక మూడోసారి పై క్రియలన్నీ జరిగిన తరువాత తన దోసిలిని పైన పెట్టి వరుడు ఈ క్రింది మంత్రం చెబుతూ వధువుపైన తలంబ్రాలు పోస్తాడు..

**యజ్ఞో మే. కామ స్సమృధ్యతామ్**

నా కిష్టమైన త్యాగం సమృద్ధిగా ఉండాలి.

నాల్గోసారి మంత్రాలు లేకుండానే తలంబ్రాలు పోసుకుంటారు. కొందఱి మతంలో నాల్గోసారి ఈ క్రింది మంత్రం ఇద్దఱు కలసిచెప్పి, ఒకేసారి ఒకరిపై ఒకరు తలంబ్రాలు పోసుకొంటారు..

**శ్రియో మే కామ స్సమృధ్యతామ్**

మాకు కావలసిన సిరిసంపదలు సమృద్ధిగా ఉండాలి.

ఇలాగే **"యశో మే కామ స్సమృధ్యతామ్"** (నేను కోరిన కీర్తి ప్రతిష్ఠలు సమృద్ధిగా ఉండాలి) అనే మంత్రాన్ని కూడా కొందఱు ఈ సందర్భంలో చెబుతారు.

**20. కంకణాలు:**

కంకణాలు కట్టడాన్నే రక్షాబంధన మంటారు. భౌతికమైన ఉపద్రవాలనుంచి రక్షణకోసం, పురుడు, మైల మొదలైనవి సోకకుండా ఉండటం కోసం, కార్యనిర్వహణ దీక్షకోసం కంకణాన్ని కడతారు.

వరుడికి కుడిచేతికి, వధువుకు ఎడమచేతికి కంకణం కట్టాలి. జరగబోయే పాణిగ్రహణానికి ఇది అంగం. వివాహంలో మంగళప్రదమైన ఈ కంకణం వధూవరుల రక్షణకోసం ఉద్దేశింపబడుతున్నది. ఈ కంకణాన్ని నాల్గోరోజు రాత్రి తిరిగి విప్పేయాలి.

**21. బ్రహ్మముడి:**

వధువు చీర అంచును వరుని ఉత్తరీయం అంచును కలిపి ముడి వేయడాన్నే బ్రహ్మముడి అంటారు. తెలుగువాళ్లు దీన్నే కొంగుముడి అంటారు. ఈ క్రింది మంత్రం చెబుతూ పురోహితుడు ఇద్దరి కొంగులు ముడివేస్తాడు..

**ధ్రువం తే రాజా వరుణో ధ్రువం దేవో బృహస్పతిః।**
**ధ్రువం త ఇంద్రశ్చాగ్నిశ్చ రాష్ట్రం ధారయతాం ధ్రువమ్॥**

దాంపత్యసామ్రాజ్యాన్ని అనుభవించే మీకు రాజైన వరుణుడు, దేవుడు బృహస్పతి, ఇంద్రుడు, అగ్ని నిశ్చలత్వాన్ని కలగజేయాలి

తరువాత వరుడు తన కుడిచేతితో వధువు కుడిచేతిని పట్టుకొని అగ్నిహోత్రుని దగ్గరకు తీసికొని వచ్చి నమస్కరించి ఈ మంత్రాన్ని చెబుతాడు..

**పూషా త్వేతో నయతు హస్త గృహ్యాశ్వినౌ త్వా ప్రవహతాం రథేన।**
**గృహాన్ గచ్ఛ గృహపత్నీ యథా సోవశినీ త్వం విదథమావదాసి॥**

నిన్ను పూష ఇలావెంట తీసికొని వెళ్లాలి. అశ్వినీదేవతలు నీ చేతులు పట్టుకొని రథంపైన తీసికొనిరావాలి ఇంటి ఇల్లాలుగా అన్నింటినీ తీర్చిదిద్దడానికి నా ఇంటికిరా! యజమానురాలిగా గృహస్థధర్మాన్ని నిర్వహించు!

**22. ప్రధానహోమం:**

కొత్త దంపతులిద్దఱు అగ్నిహోత్రుని దగ్గఱ కూర్చొని గృహస్థాశ్రమంలో మొట్టమొదట చేసే హోమమే ప్రధానహోమం. ప్రధానహోమం పూర్తయిన తరువాత వరుడు వధువును రెండుచేతులతో బుజాలపై తాకి ఇలా అభిమంత్రిస్తాడు..

**సోమః ప్రథమో వివిదే గన్ధర్వో వివిద ఉత్తరః।**
**తృతీయో అగ్నిష్టేపతి స్తురీయస్తే మనుష్యజాః॥**

మొదట సోముడు, తరువాత గంధర్వుడు, ఆపైన అగ్ని నిన్నుపొందారు మానవుడైన నేను భర్తగా ఇప్పుడు నిన్ను పొందుతున్నాను.

**సోమోऽదదద్గంధర్వాయ గంధర్వోऽదదదగ్నయే।**
**రయిఞ్చ పుత్రాంశ్చాదా దగ్ని ర్మహ్య మథో ఇమామ్॥**

ఈ కన్య పుట్టగానే సోముడు గంధర్వునికి, గంధర్వుడు అగ్నికి ఇచ్చాడు. అగ్నిదేవుడు ధనపుత్రసమేతంగా ఈమెను నాకు దానం చేస్తున్నాడు. మంచి సంతతి కలగాలి.

గార్హపత్యాగ్ని కరుణవల్ల ఈ కన్యకు మంచి సంతతి కలగాలి. భర్తనైన నాతో కలసిమెలసి ఉండి ఈమె చక్కని పిల్లలను కనాలి. ఈమెకు పుత్రసౌఖ్యం లభించాలి. ప్రజాపతి మనకు పుత్రులను పౌత్రులను అనుగ్రహించాలి. అర్యముడు వాళ్లను చిరాయుష్మంతులుగా చేయాలి. ఇంద్రుడా!ఈ నవవధువుకు పదిమందికొడుకులు కలిగేటట్లు అనుగ్రహించు! భర్తనైన నేను పిల్లలతో కలసి పదకొండోవాణ్ణి కావాలి. ఇవి వరుని మాటలుగా ఛాందోగ్యబ్రాహ్మణం(1.2.18,19) అభివర్ణిస్తున్నది.

**23. పాణిగ్రహణం:**

కొందఱు పాణిగ్రహణమే వివాహంలో ముఖ్యమైనదని చెబుతారు. అందుకే వివాహానికి పాణిగ్రహణం పర్యాయపదమైంది. ఇంతకు పూర్వం వరుడు వధువుచేతిని పట్టుకొని అగ్నిహోత్రుని దగ్గరకు ఆమెను తీసుకొని

వెడతాడు. కాని ఇప్పుడు వధువు వరుని హస్తాన్ని పట్టుకొని, జీవితాంతం అతణ్ణి అనుసరించి సంతానాన్ని సౌభాగ్యాన్ని పొంది తన స్త్రీత్వాన్ని సార్థకం చేసుకుంటుంది.

ఇక్కడొక విశేషమున్నది. మొదట ఆడపిల్ల పుట్టాలనే కోరిక ఉంటే వరుని చూపుడువేలుగాని లేక మొత్తం నాలుగువేళ్లుగాని వధువు పట్టుకోవాలి. మొదట మగపిల్లవాడు కావాలంటే వరుడి బొటనవేలు మాత్రమే పట్టుకోవాలి. వధువు తన చేతిని అందుకుంటున్నప్పుడు వరుడు ఈ క్రింది మంత్రాన్ని చెప్పి ఆమెకు చేతి నందించాలి..

**గృభ్ణామి తే సుప్రజాస్త్వాయ హస్తం**
**మయా పత్యా జరదష్టిర్యథా సః।**
**భగో అర్యమా సవితా పురన్ధి**
**ర్మహ్యం త్వాఽ దుర్గార్హపత్యాయ దేవాః॥**

నా పెద్దల లాగానే నేను కూడా మంచి సంతానం కోసం నిన్ను పాణిగ్రహణం చేస్తున్నాను. భగుడు, అర్యముడు, సవిత అనే దేవతలు నా గృహస్థాశ్రమం కోసం నిన్ను గృహిణిగా చేస్తున్నారు.

**తే హ పూర్వే జనాసో యత్ర పూర్వవహో హితాః**
**మూర్ధన్వాన్ యత్ర సౌభ్రవః పూర్వో దేవేభ్య ఆతపత్**
**సరస్వతి ప్రేదమవ సుభగే వాజినీవతి**
**తాం త్వా విశ్వస్య భూతస్య ప్రగాయామస్యగ్రతః**

మన పూర్వులు ప్రాచీనమైన ఈ మార్గాన్ని అనుసరించి శ్రేయస్సును పొందారు. వేగవతీరూపాన్ని పొందిన ఓ సరస్వతీ! వెనుకటి పతివ్రతలు అందఱుమెచ్చే శీలంతో ఎలా ప్రకాశించారో, అలా మంచి పేరు తెచ్చుకొనేటట్లు ఈమెను కాపాడు! సరస్వతి దయవల్ల నీవు లోకం లోని స్త్రీలందఱిలో అగ్రగణ్యురాలివి కావాలి.

**య ఏతి ప్రదిశః సర్వా దిశః అనుపవమానః।**
**హిరణ్యహస్త ఐరమ్మస్స త్వా మన్మనసం కృణోతు॥**

దశదిశలను మెరుపులతో సత్త్వశక్తితో, ప్రకాశంతో వ్యాపించే సరస్వతీదేవి రూపాలు బంగారు చేతులతో నా ధ్యానంలో నిలబడాలి.

**24. సప్తపది:**

పరమపావనుడైన అగ్నిహోత్రుడు సాక్షిగా పాణిగ్రహణం చేస్తారు వధూవరులు. వరుడు అగ్నిహోత్రునికి ఉత్తరదిశగా వధువుచేత తూర్పుకుగాని ఉత్తరానికిగాని కుడికాలుతో ఏడడుగులు వేయిస్తాడు. దీన్నే సప్తపది అంటారు. ఏడడుగులు వెంట నడిస్తే స్నేహబంధం ఏర్పడుతుందని ఎప్పటినుంచో పెద్దలు చెబుతున్నమాట. ఈ సప్తపది జరిగిన తరువాతనే వధువు గోత్రం వరునిగోత్రంగా మారిపోతుంది. ఇక్కడ వరుని వెంట వధువు వేస్తున్న ఒక్కొక్క అడుగుకు ఒక్కొక్క ప్రయోజనం ఉందని వరుడు చెప్పే ఈ క్రింది మంత్రంలో అర్థమవుతుంది. చూడండి....

**ఏకమిషే విష్ణుస్త్వాఽన్వేతు. ద్వే ఊర్జే విష్ణుస్త్వాఽ న్వేతు.**
**త్రీణి వ్రతాయ విష్ణుస్త్వాఽ న్వేతు. చత్వారి**
**మయో భవాయ విష్ణుస్త్వాఽన్వేతు.**
**పంచ పశుభ్యో విష్ణుస్త్వాఽన్వేతు. షడృతుభ్యో విష్ణుస్త్వాఽ**
**న్వేతు! సప్త హోత్రాభ్యో విష్ణుస్త్వాఽన్వేతు.**

ఓ చిన్నదానా! నీవు నావెంట నడు! విష్ణుమూర్తి నీవు వేసే మొదటి అడుగువల్ల అన్నాన్ని, రెండవ అడుగువల్ల బలాన్ని, మూడో అడుగువల్ల మంచికార్యాలను, నాల్గో అడుగువల్ల సౌఖ్యాన్ని, ఐదో అడుగువల్ల పశుసమృద్ధిని, ఆరో అడుగువల్ల ఋతుసంపదలను, ఏడో అడుగువల్ల ఏడుగురు హోతలను నీకు అనుగ్రహించుగాక! ఏడడుగులు వేసిన తరువాత వరుడు వధువుతో ఇలా అంటాడు...

సఖా సప్తపదా భవ. సఖాయౌ సప్తపదా బభూవ. సఖ్యంతే
గమేయం. సఖ్యాత్తే మా యోషం, సఖ్యాన్మే మా యోష్ఠాః
సమయావ. సంకల్పావహై. సంప్రియౌ రోచిష్ణూ
సుమనస్యమానౌ ఇష మూర్జ మభి సంవసానౌ సం నౌ
మనాంసి సంవ్రతా సముచిత్తాన్యకరమ్.

నాతో ఏడడుగులు నడచి నాకు మంచి స్నేహితురాలివి కావాలి. మనమిద్దఱం కలసి ఏడడుగులు నడిస్తే స్నేహితులమౌతాం. అప్పుడు నేను నీ స్నేహాన్ని ప్రేమను పొందుతాను. నీ స్నేహాన్నుంచి ఎన్నటికీ వియోగం  పొందను. నా స్నేహాన్నుంచి నీ వెన్నడూ వియోగం పొందకు। పరస్పరం ప్రేమతో, అనుకూల దాంపత్యంతో ప్రకాశిస్తూ, నిండు మనస్సుతో ఆహారాన్ని, బలాన్ని పొందుతూ కలసి ఉందాం. కలసి ఆలోచించుకుందాం. మన మనస్సులు కలసేలా నడచుకుందాం. అలాగే అన్ని నియమాల్లోను బాహ్యేంద్రియాలు కూడా కలసి ఉండేటట్లు నడచుకుందాం.

తరువాత వధువు వరునితో ఇలా అంటుంది..

**సా త్వమసి అమూహం అమూహమస్మి సా త్వం ద్యౌ రహం పృథివీ।**
**త్వం రేతోఽహం రేతోభృత్ త్వం మనోఽ హ మస్మి॥**

నీవు పొరపాటు లేకుండా ఉండు। నేను కూడా ఏ పొరపాటు రాకుండా చూసుకుంటాను. నీవు ఆకాశానివి. నేను పృథివిని. నీవు శుక్రధాతువు. నేను శుక్రాన్ని ధరిస్తాను. నీవు మనస్సువు. నేను వాక్యాన్ని.

వరుడు వధువుతో ఇలా అంటాడు..

**వాక్త్వం సామాహమస్మి ఋక్ త్వం సామామనువ్రతా భవవాకి।**
**పుంసే పుత్రాయ వేత్తవై శ్రియై పుత్రాయ వేత్తవ ఏహి సూనృతే॥**

నేను సామను, నీవు ఋక్కువై నన్ననుసరించు। మంచి ప్రవృత్తి గల దానవై నీవు పుంస్త్వంగల పుత్రులను కనాలి. వాళ్ళు సూనృత భాషణం కలిగి సంపద్రూపులై విలసిల్లాలి.

**25. లాజహోమం:**

లాజలంటే పేలాలు. పేలాలతో వధువుచేత హోమం చేయిస్తాడు వరుడు. తన భర్తకు దీర్ఘాయువు కలగాలని, తాను దీర్ఘసుమంగళిగా ఉండాలని కోరుతూ వధువు లాజలను అగ్నికి ఆహుతిగా సమర్పిస్తుంది

అగ్నిహోత్రునికి ఉత్తరంగా వధువును కుడికాలుతో ఒక రాతిని తొక్కిస్తూ వరుడు ఇలా అంటాడు..

ఆతిష్ఠేమమశ్మాన మశ్మేవ త్వం స్థిరా భవ।
అభితిష్ఠ పృతన్యతః సహస్వ పృతనా యతః॥

ఓ సుందరీ! ఈ రాయిని తొక్కు. దీనిలాగానే స్థిరంగానే ఉండు! శత్రువులను బాధించు!

తరువాత వధువు చేతిలో రెండుసార్లు పేలాలను పోసి, వాటిపై నేతిని పోస్తాడు వరుడు. పేలాలను పెండ్లికూతురు అప్పచెల్లెళ్ళు ఆమె చేతిలో పోస్తారని కొందఱి అభిప్రాయం. వధువు లాజలను అగ్నిహోత్రునికి అర్పిస్తూ ఇలా అంటుంది.

ఇయన్నార్యుపబ్రూతే కల్పాన్యావపన్తికా।
దీర్ఘాయురస్తు మే పతిర్జీవాతు శరదశ్శతమ్॥

నా భర్తకు దీర్ఘాయుష్యం కలగాలి. ఆయన నిండుగా నూరేళ్ళు జీవించాలని నేను కోరుతున్నాను. మా దాంపత్యం చల్లగా వర్ధిల్లాలి.

ఛాందోగ్య బ్రాహ్మణంలో మొదటి ప్రపాఠకంలోని మూడో ఖండంలో భర్త భార్యకు చేయవలసిన ఉపచారాల ప్రస్తావన ఉంది. నీకెలాంటి అనారోగ్యం రానీయనని భర్త భార్యకు మాట ఇస్తాడు. భూమి, ఆకాశం, హిమవంతుడు, కులపర్వతాలు ఎంతకాలం ఉంటాయో అంతకాలం ఈ దాంపత్యం చల్లగా వర్ధిల్లాలి.

ఇద్దఱూ అగ్నికి ప్రదక్షిణం చేస్తారు. తరువాత వరుడు మళ్ళా వెనుకటి లాగానే వధువును రాతిపైకి ఎక్కిస్తాడు. ఆ పైన వధువు వెనుకటి లాగానే పేలాలు అగ్నికి సమర్పిస్తుంది. మళ్ళా ప్రదక్షిణం చేస్తారు. మూడవసారి రాతిపై ఎక్కి లాజలను హోమం చేయడంతో లాజహోమం పూర్తవుతుంది.

**26. అరుంధతీ నక్షత్రం:**

వివాహం జరిగిన రాత్రి వధూవరులను ఇంటిబయట తూర్పునకుగాని ఉత్తరానికిగాని తీసుకువెళ్ళి మొదట ధ్రువ నక్షత్రాన్ని, తరువాత అరుంధతీ నక్షత్రాన్ని వారికి చూపించాలి ధ్రువనక్షత్రంలాగా

వారు నిశ్చలమైన మనస్తత్వాలతో స్థిరంగా ఉండాలని ఈ వధువు అరుంధతి లాగా మహా పతివ్రత కావాలనే ఆకాంక్ష ఇందులో కనబడుతున్నది.

**27. వధూవరుల బాసలు:**

వివాహసమయంలో వధూవరులెన్నో బాసలు చేసుకుంటారు. వాటిలో కొన్నింటిని దిఙ్మాత్రంగా ఇక్కడ ఉదాహరిస్తున్నాను..
వరుడు:

**అర్యమణం ను దేవం కన్యా అగ్నిమయక్షత. స ఇమాం దేవో అధ్వరః ప్రేతో ముంచాతి. నాముతస్సుబద్ధామముతస్కరత్.**

పూర్వం స్త్రీలు అగ్ని దేవుణ్ణి పూజించి కోరిన భర్తను పొందగలిగారు. లోకోపకార స్వభావంగల అగ్నిదేవుడు ఈ వధువుకు వివాహమైన తరువాత పుట్టింటిమీద మమకారం తగ్గించి అత్తింటిమీద అభిమానం గలదాన్నిగా చేయాలి.

వరుడు:

**త్వష్టా జాయా మజనయ త్త్వష్టాస్యై త్వాం పతిమ్।**
**త్వష్టా సహస్రమాయూగ్ంషి దీర్ఘమాయుః కృణోతు వామ్॥**

ఓ మనసా! బ్రహ్మ ఈ చిన్నదాన్ని నాకు భార్యగా సృష్టించాడు నన్ను ఈ కన్యకు భర్తగా సృష్టించాడు. ఆ బ్రహ్మదేవుడు మా ఇద్దరికి సకలసంపదల నిచ్చి దీర్ఘాయుష్యాన్ని అనుగ్రహించాలి.

వరుడు:

సుమంగళీరియం వధూ రిమాగ్ం సమేత పశ్యత।
సౌభాగ్య మస్యై దత్వా యాథా ధాథా స్తం విపరేతన॥

సుమంగళిగా, సౌభాగ్యవతిగా దీర్ఘాయుష్యంతో ఉండే ఈ వధువును మీరందరు వచ్చి చూచి, ఇంకా ఇంకా సౌభాగ్యవతి, దీర్ఘాయుష్మంతురాలు కావాలని ఆశీర్వదించి మీమీ ఇండ్లకు స్వేచ్ఛగా వెళ్ళండి!

వధువు:

**అపశ్యం త్వా మనసా చేకితానం**
**తపసో జాతం తపసో విభూతమ్।**
**ఇహ ప్రజామిహరయిగ్ం రరాణః**
**ప్రజాయస్వ ప్రజయా పుత్రకామ॥**

నిన్ను నా అభిప్రాయం తెలిసిన వాణ్ణిగాను, మంచి సంస్కారంతో పుట్టినవాడిగాను, మంచి నియమాలతో నిజాయతీతో పెంచుకొన్న తేజస్సుగలవాణ్ణిగాను నేను గ్రహించాను. సంతానాభిలాషగల నీవు నాలోనే సంతానాన్ని కని, సిరిసంపదలను సంపాదించి సుఖంగా జీవితాన్ని గడపాలి.

ఇద్దరు:

**సమంజంతు విశ్వే దేవా స్సమాపో హృదయాని నౌ।**
**సం మాతరిశ్వా సం ధాతా సముదేష్ఠ్రీ దిదేష్టు నౌ॥**

విశ్వేదేవులు, పవిత్రజలాలు, వాయువు, బ్రహ్మ మన మనస్సులను ఎన్నటికీ స్నేహంతో కలసిపోయేటట్లు చేయాలి. వాగధిదేవత సరస్వతి మన మెప్పుడు ప్రేమతో అభిమానంతో అనుకూలంగా మాట్లాడుకొనేటట్లు చూడాలి.

**28.** పెద్దల **ఆశీస్సులు:**

నూతన వధూవరులకు వేదమంత్రాలవల్ల వాక్శుద్ధిగల పెద్దల నిండైన ఆశీర్వచనాలవల్ల అన్ని దోషాలు పోయి, ఆయురారోగ్యాలు, భోగభాగ్యాలు గలుగుతాయి. పెద్దల వైదికాశీర్వచనాలను మచ్చుకు కొన్నింటిని ఇక్కడ పొందుపరుస్తున్నాను

పెద్దలు:

అభివర్ధతాం పయసాభిరాష్ట్రేణ వర్ధతామ్।
రయ్యా సహస్రపోషసే మౌస్తా మనపేక్షితౌ॥

ఈ వధువు పాడిపంటలతోను, ఇండ్లతోను, భూములతోను, సంపదతోను, సకలసౌభాగ్యాలతో తులతూగుతూ మా కందఱికీ అభివృద్ధిని కలిగించాలి. ఈ దంపతులు సకలసంపదలతో, సర్వసమృద్ధులతోదేనికీ ఇతరులపై ఆధారపడకుండా ఉండాలి.

పెద్దలు:

**పుత్రిణేమా కుమారిణా విశ్వమాయుర్వ్యశ్నుతమ్।**
**ఉభా హిరణ్యపేశసా వీతిహోత్రా కృతద్వసూ॥**

పదహారు వన్నెల బంగారంలాగా పచ్చగా ప్రకాశిస్తున్న ఈ కొత్త దంపతులు కొడుకులు, కూతుళ్లతో, ఈ సమాజంలో మంచిపనులు జేస్తూ, సిరిసంపదల ననుభవిస్తూ దీర్ఘాయుష్యాన్ని పొందాలి.

శ్రీరస్తు శుభమస్తు దీర్ఘాయురస్తు

